*Commended for*

1. College & School Libraries by the
   Director of Public Instruction, Hyderabad
   in his Proceedings
   L. Dis. No. 7131/V2/63 dated 29-8-68

2. Public Libraries by the
   Director of Public Libraries, Hyderabad
   in his Proceedings
   R. C. No. 268-44/68 dated 21-8-68

*Co*

1. ఈ గ్రంథము విక్రయాదాయముపై వచ్చు వడ్డీతో
శ్రీ దోమా వెంకట స్వామిగుప్తగారి పేరుతో
విద్యార్థి వేతనము గాని బహుమానము గాని యిచ్చుటకు సంకల్పింపబడినది.

2. శ్రీ జమిలి నమ్మాళ్వార్ ధర్మనిధి
(రిజిష్టర్డు) - గుంటూరు 3 - ఆంధ్రప్రదేశ్.

ప్రథమ ముద్రణము—రెండువేల ప్రతులు
విడుదల: కీలకనామ సం॥ చైత్రశుద్ధ ౧ శుక్రవారము
హూణశకము - ౨౯-౩-౬౮

ముద్రణ - మొదటి ఏడుఫారములు
కళాప్రింటర్సు - 16, ఉస్మాన్‌రోడ్, మద్రాసు - 17.
[సెప్టెంబరు 1964 నుండి ఏప్రిల్ 1967 వరకు]

8 ఫారమునుండి పూర్తిగ్రంథము
ఫ్రీడమ్ ప్రెస్ - 138, టి. హెచ్. రోడ్, మద్రాసు-21.
[ఏప్రిల్ 1967 నుండ మార్చి 1968 వరకు]

వెల పది రూపాయలు

ఎట్టి మార్పులు - కూర్పులు చేయబడక
వ్రాతప్రతి ననుసరించి ప్రచురింపబడింది



# శ్రీ కన్యకాపురాణము

శతావధాని దోమా వెంకటస్వామిగుప్త

# కృతజ్ఞతలు

గ్రంథప్రచురణ కవకాశమిచ్చిన

గ్రంథకర్తృ సతీమణి వెంకటసుబ్బమ్మ

వారి యేకైక పుత్రుడు ఆంజనేయ గుప్త

వారి యేకైక పుత్రిక భాషాప్రవీణ గోళ్ల ఇందిరాదేవి గారలకు

ముద్రణకు విరాళములిచ్చిన దాతలకు—

ముద్రణ వ్యవహారము నిర్వహించిన

పండిత శ్రీ జమిలి నమ్మాళ్వారు (గుంటూరు)

కీ॥ శే॥ కవికేసరి అద్దేపల్లి సత్యనారాయణ (మందవల్లి) గారలకు

సలహాలనిచ్చిన మిత్రవర్యులు కొమ్మూరి వెంకట్రామయ్య

చిత్రాలు గీసిన దాసరి నాగవర్ధనరావు గారలకు, తదితరులకు

మా కృతజ్ఞతాపూర్వక వందనములు

ఇట్లు

శ్రీ జమిలి నమ్మాళ్వార్ - ధర్మనిధి

(రిజిష్టర్డు) : పట్నంబజారు : గుంటూరు 3

# విషయసూచిక

# ముద్రణసహాయులు

## ఈ గ్రంథ ముద్రణకు 37 మంది యుదారులు

సహాయము నందించిరి.

### అందిన చిత్రములు గ్రంథ మధ్యభాగమున చేర్చబడినవి.

పూర్తి వివరములు యీ క్రింద యీయబడినవి

శ్రీయుతులు 1. కొత్తూరు రామయ్య గుంటూరు 2. మాడిశెట్టి బ్రహ్మయ్య గుంటూరు 3. మాజేటి వెంకటరామకోటిముత్యాలు గుంటూరు 4. ఉప్పలపంచు సూర్యనారాయణ గుంటూరు 5. కీ॥ శే॥ చక్కా పిచ్చయ్య 6. గౌరీశంకర టుబాకో కార్పొరేషన్ 7. వనమా వెంకటరత్నం 8. కూరాళ్ళ మాధవరావు గుడిపాడ 9. చీదెళ్ళ వీరయ్య దత్తకుమారుడు వెంకటేశ్వర్లు 10. దానశీల కాకరవర్తి భావనారాయణ విజయవాడ 11. పొలిసెట్టి సోమసుందరం అండ్ సన్సు 12. పైండా వెంకటరత్నం ఏలూరు 13. నూలి వెంకటసుబ్రహ్మణ్యము పెనుగొండ 14. తుమ్మలపల్లి వీరభద్రరావు పిప్పర 25. తడికమళ్ళ వీరభద్ర అప్పల చినరాజన్నగారు 16. శ్రీ కాశీవిశ్వేశ టుబాకో కంపెనీ 17. ఆచార్య కొత్తమాట వెంకటసుబ్బారావు-గుంటూరు 18. ధూళిపాళ్ళ వెంకటరత్నం గుంటూరు 19. మోతె అంజరత్న రాజకుమార్ అండ్ వెంకటసుబ్బారావు ఏలూరు 20. కొప్పు రావూరి కోటేశ్వరరావు 21. గోపవరపు వీరయ్య గుంటూరు 22. పత్రివాటి ప్రకాశరావు అండ్ బ్రదర్సు గుంటూరు 23. బొమ్మిడాల పూర్ణయ్య అండ్ బ్రదర్సు గుంటూరు 24. దిగుమతి నేతి కొట్ల చలివేంద్రసంఘము గుంటూరు 25. శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ దేవస్థానం సత్రం కమిటీ తెనాలి 26. బెద్దె కుమారస్వామి సికింద్రాబాదు 27. జూలూరి వీరేశలింగం సికింద్రాబాదు 28. చేగు కృష్ణమూర్తి గుంటూరు 29. గంధవడి శ్రీరాములుశెట్టి మద్రాసు 30. కీ॥ శే॥ కొలిశెట్టి గోపాలరావు సంస్మరణార్థము జమిలి నమ్మాళ్వారు గుంటూరు 31. గొల్లపూడి రాధాకృష్ణయ్య వేటపాలెం 32. కవిపాదుషా కొప్పు రావూరి సత్యనారాయణ విజయవాడ 33. తుమ్మలపల్లి సత్యనారాయణ మూర్తి పిప్పర 34. శింగంశెట్టి యతీంద్రులుశెట్టి చారిటీసు మద్రాసు 35. కీ॥ శే॥ బొండా వెంకటేశ్వర్లు-కొండంగి 36. శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానము నెల్లూరు. 37. తుమ్మలపల్లి చినవీరభద్రరావు పిప్పర.

# SREE KANYAKA PURANAM

*By*

LATE SATAVADHANI
DOMA VENKATASWAMY GUPTA
[1900—1962]

A Telugu poetical piece depicting the great sacrifice made by Kumari Vasavi, the only daughter of Kusuma Sreshti, the Mayor of Penugonda in West Godavari Dt. of the present state of Andhra Pradesh. Vimaladitya Vishnuvardhana, the ruling sovereign of that territory, with Rajahmundry as his capital sought Vasavi's hand in marriage and when this request was declined, he threatened to take her by force. She sacrificed herself in a ceremonial fire along with 102 representatives of her kith and kin.

This happened about one thousand years ago; historical details are under research.

***Publisher :***
JAMILI NAMMALVAR.

Manuscript finished 1942
Published 1968

## సమర్పణ

ఆంధ్రభాషామతల్లి కొక
నూతనాలంకారము సమర్పించు
భాగ్యముకలిగిన దీనాడు మాకు.
అందుల కానంద భరితుల మగుచున్నాము.
"అములాక్ష్యరాక్షరసమన్వితమూ
నవ్యనవనీతచారుకోమలభావ
రత్నాంచితమూ నైన రత్నాలంకార" మిద్ది.
"సర్వలక్షణ లక్షితమై సర్వాంగసుందర సుశోభితమై
పాఠకప్రియమనోల్లాస భాసితమైన"
ఆంధ్రప్రబంధ మీ యలంకారము.

రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణపండితులచే
1962 వ సంవత్సరమున (ఆనాడు ఉపరాష్ట్రపతి)
మద్రాసురాష్ట్ర ముఖ్యపట్టణము చెన్ననగరస్థ
శ్రీకన్యకాపరమేశ్వరీ దేవ్యాలాయాంచిత
చిత్రఫలకావిష్కరణ సందర్భమున
"ప్రథమసత్యాగ్రహి" యని పేర్కొన బడిన
'శ్రీకన్యక' పావనచరిత్ర మీగ్రంథరాజము,
శ్రీ కన్యకాపురాణము——పవిత్రనామము.

౨

నేటి పశ్చిమ గోదావరి జిల్లాయందు
పెనుగొండయను పురరాజమొండు గలదు.
షుమారు వేయిసంవత్సరాల క్రితమీ పురము
మహానగరమైయుండెను. కుసుమశ్రేష్ఠియను
వైశ్యప్రముఖుడు, యీ మహానగరపరిపాలకాధ్యక్షుడై
ఆర్థిక, న్యాయ, రక్షణాది (నేటి లండన్ నగరమువలెనె)
సర్వాం సహాధికారియై పరిపాలించుచుండె,
సామీప్యమున నున్న రాజమహేంద్రవరములోని
విమలాదిత్యునకు సామంతరాజు.

బహుకాలమునకు కలిగిన యేయైకపుత్రిక
వాసవాంబను, తన్నగర మలంకరించిన
నగరేశ్వరపూజకు నియోగించెను. ఈమె నవ
యౌననారూఢయై పరిఢవిల్లు సమయాన,
నగరమును చూడవచ్చిన,
విమలాదిత్య విష్ణువర్ధనుడు యామెను చూచి, మోహించి
వివాహ మాడ గోరెను, ఆమెయు యామె తల్లి తండ్రులు
అందుల కియ్యకొన కుండుట జరిగినది.
అతడామెను బలిమిని గొనిపోవ నున్నట్లు తెలిసి,
ఆమెయు, ఆమెసన్నిహితబంధుకోటిలో
నూటరెండుగోత్రముల ప్రతినిధులు, అగ్నికాహుతియైరి.
ఇదియే యీప్రబంధగాథ. అందువలననే
"యీమె ప్రథమ సత్యాగ్రహి'' యని నుతింపబడినది.

౩

దౌష్ట్యనాశనార్థం, గాంధి మహాత్ముడొక నూతనాయుధమును ప్రపంచానికి బహూకరించినాడు. భౌతిక శరీరమును నాశము చేయక, మనస్సును మార్చి, హృదయమందలి కాలుష్యమును కడిగివేయు సాధనము - సత్యాగ్రహము. ఇందుకు ఆత్మత్యాగమే సాధనము. త్యాగము ఫలించుటకు సత్యము పాదుగా గల హృదయ నైర్మల్యము పునాది. స్వీయహృదయనైర్మల్యముచే, పరకీయ హృదయ కాలుష్యమును కడిగి వైచుటతో అతనిని జయించును. సత్యము స్థాపింపబడును. ఇదియె సత్యాగ్రహము. ధర్మము.

ఈ నిగూఢ ధర్మ సూత్రమే ! యీ పురాణగాధాంశము. అందుచేతనే రాష్ట్రపతి యట్లనిరి.

వయోపరిణితి. లోకజ్ఞానము పరిపక్వతనందని
అష్టాదశవయస్కురాలు, అవివాహిత.
స్వీయచిత్తము నగరేశ్వరారాధనార్పితమైన అబల.
ఆత్మత్యాగముచే రానున్న ఆపదను అపుకొన్నది.
అబల సబల యనియు, అవసరమైనప్పుడు
ప్రబల కాగలదనియు ప్రపంచానికిచాటిన ఆదర్శురాలు.

౪

ఈ కథకు మూలము శ్రీ కన్యకాపురాణము
శ్రీ వాసవీపురాణము, శ్రీ వాసవ కన్యకాపురాణము

అను పేర్ల లభ్యములగుచున్న సంస్కృతకావ్యములు.
స్కాందపురాణాంతర్గతమని చెప్పబడినది. కాని
స్కాందపురాణపూర్ణప్రతి ఆంధ్రప్రాంతమున
అలభ్యముగానున్నది ప్రస్తుతము.
ఈ కథ జరిగనది
వేయి సంవత్సరాలకు పూర్వమని చరిత్రకారుల భావన.
పరిశోధన జరుగవలసియున్నది.

౩

కథాకాలమునాటికి, పెనుగొండపురము, దాని
పగిసర ప్రాంతపు పదునెనిమిది పట్టణములు
కుసుమశ్రేష్ఠి పరిపాలన క్రిందయుండినవి.
రాజమహేంద్రాధిపతులకు సామంతులై నను
ఆర్థిక, రాజకీయ, దేశరక్షాధి సర్వం సహాధికారులై,
యుండిరనుట తెలియనగును.
యుగయుగాదులనుండి, ఆర్థిక శాఖాధికారులై,
దేశసంపదకాలవాలురై నను
ధర్మకర్తృత్వతాభావసంప్రోదితులై
పరిపాలనలో వైశ్యులు పాల్గొనుచుండే వారని
పురాణవివరములు తెలియజేయుచున్నవి.

భారతంలో శాంతిపర్వములో
దేశపరిపాలనలో, వైశ్యులకు విశేషప్రముఖస్థానము
యీయబడినట్లుకూడా తెలియవచ్చు.

ముప్పయియైదుమంది సభ్యులుగల శాసనసభలుండేవనీ
అందులో వైశ్యులు యిరువదిముగ్గురనియు
యితరులు (బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు,
సూతులు) పన్నెండుమంది మాత్రమేననీ
ఈసంవత్సరం మార్చి యిరవైనాల్గుతేది
సండేస్టాండర్డు (Sunday Standard) పత్రికలో
"వేదకాలంలో ప్రజాస్వామ్యం
(Democracy in Vedic Age)
అనే వ్యాసంలో తెలియజేయబడింది.

ముప్పయి సం॥ క్రితమువరకు, తాలూకా ఆఫీసులలో
షరాబులుగా ఆంధ్రవైశ్యులలో
"నంబూరు" యింటిపేరు గలవారే
నియోగింపబడుచూ వచ్చిరి. ఆంగ్లేయపరిపాలకులు అట్టి
కట్టడి జేసి యుండిరని కూడా తెలియుచుండె.

మరియు ఆనాటి పెనుగొండ పురపాలకులు
రాజనీతి దురంధరులుగాను, దౌత్యకళానిపుణులుగా
నున్నట్లు, తెలియనౌతుంది.
శ్రీ వాసవికన్యను తన కిచ్చు విషయమై
తుది నిర్ణయమున కొక మాసపు గడువు నిచ్చి
విష్ణువర్ధనుడు, తన పట్టణమున కేగి,
పెనుగొండలో జరుగు విశేషాల గమనిక నిమిత్తం
భటులను పంపగా,
కుసుమశ్రేష్ఠి కాంతాకనకములచే

యాభటులను ప్రలోభపెట్టి
తనవైపుకు త్రిప్పుకొనినట్లు కథలో చెప్పబడినది.
ఈ విషయము, రెండవప్రపంచసంగ్రామములో
పెరల్‌హార్బర్ కథను జ్ఞప్తికి తెస్తుంది.

ఈ పెరల్‌హార్బరు సంఘటనయే జపానులో
అమెరికావారు, గతయుద్ధంలో, ఆటంబాంబును
ప్రయోగించుటకు కారణమని ప్రతీతి,
ఈ ఓడరేవును, అయిదువందలమంది అమెరికన్
యువకసైనికులు సంరక్షించుచుండగా
ఒకానొక దినమున అచ్చటికి విలాసార్థమని
అయిదువందలు జపానుయువతులు వచ్చి,
మకాముచేసి, క్రమముగా సైనికుల వశపరచికొనిరి.
నడిరేయి యొకనాడు, జపానునావలు, యీరేవు
ప్రవేశించునప్పటికి
అమెరికన్‌సైనికులు జపానుయువతుల కౌగిళ్లలో
కేళీవిలాసలోలురై కర్తవ్యమును మఱచిరి.
రేవు జపానువారి స్వాధీనమైనది - ఇది పత్రికావార్త.

౬

కథాంశమే కావ్యాంశము
సంగ్రహ వచనస్వరూపము గ్రంథాంతనందీయబడినది,
అందుచే నిట ప్రస్తావింపబడుటలేదు,

౭

గ్రంథకర్త జననము 1900 సంవత్సరప్రాంతము,
రాయలసీమలోని కర్నూలుపట్టణము.
పందొమ్మిదివందల పదునెనిమిది — ౧౯౧౮
ప్రాంతమున, యీ ప్రాంతమును పీడించిన
కలరా అంటువ్యాధివలన, మేనమామల యూరైన
గుంటూరుకు వచ్చి మకాము పెట్టిరి.
అప్పటినుండి జీవతాంతము ౧౩-౯-౬౯ వరకు
యీ ప్రాంతమందే యుండిరి.
ప్రతిసభయందును యీక్రిందిపద్యాన్ని
చెప్పడము వారికి సరదా.

నాల్గవ పాదాన్ని సమయానుకూలంగా మారుస్తూ—

తుంగభద్రాతీర రంగస్థలం బైన
కందనోల్గ్రామంబు కాపురంబు
శతావధానవిధాన సంధాన గురువులు
తిరుపతి వెంకటేశ్వరులు గురులు
అష్టావధాన శతావధానాదిక
విత్యముల్ చేయంగ వెలయు పనులు
ప్రకృతంబు చెన్నపుర క్రైస్తవ కళాశాల
యాంధ్రబోధకత యొప్పౌఱు పదవి

సజ్జనులగొల్చు టందె యుత్సాహ గరిమ
"దోమవెంకటస్వామి" గుప్తా మ లాఖ్య
నొప్పువాఁడ నాకృతులను నొప్పుఁడయ్యు
భవ్యగుణులార! యో! యార్యవైశ్యులార!

జీవించిన అరువదేండ్లలోను
సాహితీక్షేత్రంలో యెన్నో పంటలు పండించారు.
కవితావనంలో రకరకాలు పూవులు పూయించారు,
"అవధానిపంచానన" అనే బిరుదందు కొన్నారు.
గండపెండేరము తొడిగించుకొన్నారు.

"ఏనుగనెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము"

అని తమ గురువులు శ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులు
చెప్పుకొనిన పద్యాన్ని శిష్యులు గుప్తగారు కూడా
తమజీవితంలో సార్థక పరచుకొన్నారు.

"ఎదురైనచో తనయెద్దుబండిని నిలిపి
కేలూతయిచ్చి యెక్కించుకొనియె"

నని తనస్నేహితుడు ఉప్పుటూరి వెంకటపున్నయ్య
గుంటూరు (కీర్తిశేషులు) గారి యెద్దుబండి (1918 లో
గుంటూరుకుకార్లురాలేదు)నెక్కుచూ చమత్కరించేవారు.

కవిగా పండితుగా ఉపాధ్యాయుడుగా
హరికథకుడుగా "పుంభావ సరస్వతి"గా
ఆంధ్రాఖండమునం దద్వితీయ ప్రతిభా వ్యుత్పత్తులతో
అర్ధశతాబ్దము అలరినారీ గ్రంథకర్త.
వీరిది ఆంగీరసగోత్రము
ఆపస్తంబసూత్రులు - యజుశ్శాఖాధ్యాయులు
తల్లితండ్రులు—కోటమ్మ గోవిందశెట్టిగారలు.



కథాంశము పురాణమేయయినను
రచనావిధానము—కావ్యసరణి.

కావ్యలక్షణలక్షితమై యలరారుచున్నది.
పాఠకప్రియమనోల్లాసభాసితమై
వివిధాలంకారశోభనశోభితమై
శయ్యా, పాకము, భాష
రుచి, భావస్ఫూరకపదలాలిత్యము, గంభీరతాది
నవరసపూరితరసగుళిక.
ప్రాణరక్ష కన్న మానరక్ష
పరమోత్కృష్ట ధర్మ మని చాటి చెప్పిన
వీరనారీమణి దివ్యచరిత్ర.

క్రీస్తుత్యాగముతో సమానమనివర్ణింపబడింది.

ఇట్టిగాథలు దేశచరిత్రలో ఎన్నున్నను
అవి యామె చరిత్రకు సరి రావు.
జాతిపిత గాంధిమహాత్ముడు
తాను సత్యాగ్రహిగా సర్వసంగపరిత్యాగియగుటయేగాక
లక్షల మందిచే సర్వసంగపరిత్యాగము చేయించెను.
ఈ సమర్పణ కర్తచే వ్రాయబడిన
శ్రీ కన్యకా సుప్రభాతమందలి
యీ క్రిందిశ్లోకములు పైవివరణకు నిదర్శనములు.

"గాంధీమహా యోగి నియోజితాత్మం। సత్యాగ్రహోద్దౌష్ట్య నివారణార్థమ్
తస్యప్రయోక్త్రీ ప్రథమా త్వ మేవ।శ్రీకన్యకామానిని ! సుప్రభాతమ్ ।

"అగ్నౌ శరీ రార్పణ దివ్యగాథాః।లోకప్రసిద్ధాః బహూశా హి నార్యః
త్వయా సమానా భువి నాస్తి నాస్తి।శ్రీకన్యకామానిని। సుప్రభాతమ్।

"త్యక్త్వా నిజాసూన్ తృణవ త్సమస్తైః
ధర్మస్య సంరక్షణ మేవ కార్యమ్
ఏతత్ సమాఖ్యాతి భవ చ్చరిత్రం
శ్రీకన్యకామానిని। సుప్రభాతమ్।

శ్రీ కన్యకాదేవి అగ్నియందు తానే
ఆహూతికాలేదు. ఆమె వెంట
నూటరెండు కుటుంబముల ప్రతినిధులును కూడ
అగ్ని కాహూతి యయిరి.
ఇదియే కథా విశేషాంశము.
మనదేశమం దనేక పతివ్రతలు
పరరాజుల నుండి మానరక్షణకు తామే యగ్గి ప్రమగ్గిరి.
వారి దాసీ లైనను వారి వెంట రాలేదు.



ఈ కథయందలి యాదార్థ్యమును గూర్చియు,
చరిత్రాధారముల గూర్చియు, ఇంతవరకు

కీ॥ శే॥ సామివెంకటాచలంశెట్టి గారు
వైశ్యడైరెక్టరియందు "చరిత్రకాలవిమర్శన" లోను
"దక్షిణ ఇండియా రిసెర్చి"లోను

కీ॥ శే॥ వేకుమళ్ల రాజగోపాలరావుగారు
"దక్షిణఇండియా రిసెర్చి" యందును

కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు
'రాజరాజనరేంద్ర పట్టాభిషేక' సంచికయందును
"విష్ణువర్ధనుడు-వాసవికన్యక" యందును

కీ॥ శే॥ గ్రంథి వెంకటసుబ్బరాయశర్మ (గుప్త) గారు
వాసవి 11 సంపుటము 1 సంచికలో "కన్యకాపరమేశ్వరి"ని

కీ॥ శే॥ తుంపూడి భగవంతం గుప్తగారు
వాసవి 2 సంపుటము 10 సంచికలో "కన్యకాపురాణము"ను
చర్చించి యుండిరి.

శ్రీ విద్వాన్ అంబటి సుబ్బరాయగుప్త యం, ఎ. బి. ఓ. యల్. గారు పై వాటిని పరిశీలించి యీ క్రింది విధంగా నిర్ణయించారు.

1. ఈ కథాకాలము క్రీ॥ శ॥ 918 నుండి 925 వరకు రాజమహేంద్రవరమును పాలించిన 'అమ్మరాజ విష్ణువర్ధను'ని కాలమందై యుండవచ్చును. దీని తదుపరి 50 సంవత్సరాల నాటివని చెప్పబడుచున్న కొన్ని శాసనములలో, పెనుగొండ వైశ్యులనుండి చీలిపోయిన 612 గోత్రములలోని కొన్ని శాఖలు పేర్కొనబడుట ప్రబల సాక్ష్యము.

2. అప్పటికి రజస్వలానంతర వివాహములు నిషేధింపబడలేదు.

3. అప్పటికి మేనరికపు ఆచారములేదు. అట్టి నిబంధన నేర్పరచినచో, తనకు కలిగిన యాపద వంటి యాపద ముందు జరుగకుండుటకుగా నామె దానివిషయమై నొక్కి వక్కాణించెను.

4. ఆనాడు వైశ్యులు ప్రభువులుగా, పరిపాలకులుగా మాత్రమేగాక, యుద్ధవిశారదులుగ, సేనానాయకులుగ నుండిరి.

5. ఆనాడు కులధర్మములుగా చెప్పబడిన 'కర్మలు, షోడశ కర్మలు, వైదికమంత్ర తంత్రములతో జరుగుచుండెడివి.

6. "ఈ కథగల పురాణము లన్నింటియందును స్కాంద పురాణాంతర్గతమని చెప్పబడియున్నది. మార్కండేయ పురాణ మందు, కన్యకాచరిత్రకు సామ్యముగల కథ యొకటి గలదు. కావున రెండవదానికి ప్రాముఖ్యత నీయవచ్చును.

7. "ఫేనకొండము"అని_అస్సాంలో యొక గ్రామమున్నది. ఇచ్చట నుండియే వైశ్యులు గోదావరి తీరమునకు వలస వచ్చిరను సిద్ధాంత మొకటి యున్నది అచ్చటనుండి వచ్చినవారు, తమ నూతన నివాసమునకు "పెనుగొండ" లేక "పెన్గొండ" యని పేరిడి యుండవచ్చును. మూడువందల యేండ్లక్రితము ఇంగ్లాండునుండి అమెరికాకు వలసవెళ్లినవారు, తమతమ నూతన నివాసములకు, యింగ్లండులోని పేర్లకు "న్యూ" అని పేరుపెట్టిరి. న్యూయార్క్ (New york) న్యూ యింగ్లండు (New England) మొద లగునవి.

పై వివరములు పెనుగొండ ఆర్యవైశ్యయువజన సంఘమువారు 1967 లో ప్రచురించిన "శ్రీ వాసవ కన్యకాపురాణము" నుండి గ్రహింపబడినవి.



జననము 1900 లు ప్రాంతములో -
కర్నూలులో.

దోమావారు వర్తకోపాధిగాగల సామాన్యవంశమువారు గాక, సామాన్యేతర గౌరవప్రతిష్ఠావిశేషాన్వితులని యీ క్రింది పద్యమువలన తెలియగలదు.

ధనము చేతను గాక గొనము చేతనె మహో
ద్దాములై మనువారు 'దోమ' వారు
దత్తమండలిలో "సుదాత్తు" లంచనఁ జాలు
ధూర్వహాత్వమువారు 'దోమ' వారు
దేవ భూదేవతా సేవ నెప్పుడు జేయఁ
దొడరుచుండెడువారు 'దోమ' వారు
రాజరాజాస్థాన రమ్యగౌరవము లం
దుచును మించినవారు 'దోమ' వారు
దోసము లొనరింపని వారు 'దోమ' వారు
దొంగ మాటల నాడని వారు 'దోమ' వారు
అనెడి కీర్తి సంపాదించినాడు; కాన
దోమ గోవింద ఘనుని కిం కేమి కొదువ?

—గద్వాల, విట్లాపుర సంస్థానములందు ప్రధాన పరిపాలనోద్యోగులుగ నున్నారట యీ వంశమువారు.

వీరి వంశావళీ వివరములు
"పరకాలవిలాస" నాటకమందు
విపులముగా నివ్వబడినవి.
కడుంగడు చిన్నతనమునందే సాహితీరంగ
ప్రవేశమైనట్లు కన్పట్టు.

"పదకొండేండ్ల వయస్సునుండి కవితావ్యాపారమున్ బూనియున్
పదియాఱేడుల యీడునుండి యవధానంబుల్ రహిన్ చేయుచున్
సదసద్వేత్తలు పెద్దలెన్న సముదంచద్గ్రంథముల్ వ్రాయ నొ
ప్పుదు శ్రీరామకృపాకటాక్ష విసరప్రోల్లాస మేపారగన్"

### పితామహుడు వెంకన్నగారిని గూర్చి

మంత్రి సామంతరాణ్మహితమౌ గద్వాల
రాజసభను గౌరవమ్ము నందె
విట్లాపురము జమీ విలిచి కొన్నేండ్లు పూ
ర్వనికి వన్నెగని పాలనము జేసె;
దారిద్ర్య దేవతా దరపాత్రులైన యూ
రూరి బంధుల నెల్లఁ జేరఁదీసె
తనవారు పెరవారుఁ దనకుఁ బైవారు దై
వంబు మెచ్చఁ దగిన పనులు సలిపె
దేవ భూదేవ సేవ భక్తిని నొనర్చె
దానధర్మ సంతాన సంతానగౌర
వంబు లందున నెంతయు డంబుఁ గనియె
నెల్లరకు మేటి! వెంకన్న కెవరు సాటి??



గుప్తగారు తమ విద్యాగురువుల యెడ తమకుగల భక్తివిశ్వాసముల నీవిధంగా, స్వరచిత శ్రీబ్రహ్మేశ్వర పురాణమందు ప్రకటించుకున్నారు.

### శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవుల గూర్చి

సరసానేక మహాప్రబంధపటలీ సారస్వతప్రక్రియా
భరి తోదార కవిత్వ తత్వ విజిత ప్రాంచత్ సురాధ్వనాం
తరభణ్మంబుజకర్ణికాప్రవిమల న్మారంద ధారాయశో
భరులం దిర్పతి వెంకటేశ కవులన్ భావింతు నశ్రాంతమున్

### శ్రీమదింద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రుల గూర్చి

నిగ మాగమజ్ఞుఁడై నెగడె నాతం డన
రహి నాతని సదాచరణము సాక్షి

వేదాంత మందును విజ్ఞుఁ డాతం డన్న
నతని నిస్పృహతయే యందు సాక్షి
సంస్కృతాంధ్రములకు సాగరం బతఁడన
నతఁడు వ్రాసిన గ్రంథతతియె సాక్షి
ఒజ్జరికంబున నొప్పె నతం డన
నతని యంతేవాసి సతతి సాక్షి
కరము బ్రహ్మణ్యుఁ డతనఁగా యతని య
జాతశత్రువిఖ్యాతి మించఁదగు సాక్షి
అట్టి యింద్రకంటి కులార్ణవాంశుఁ
గొలుచువాఁడ సుబ్రహ్మణ్య గురుని నెలమి

## శ్రీ మదనుమల విశ్వనాథశాస్త్రి గూర్చి

గంగం దాల్చని విశ్వనాథుఁడయి తద్గంగాధరోద్యజ్జటా
రంగద్గాంగఝుటానుకారికవితా ప్రాంచన్మహోవైఖరీ
భంగీసంగతుఁ డాంగలాంధ్రసురవాద్వాల్లభ్యదీవ్యత్కవి
త్వాంగీకుర్వదశేషతజ్ఞుఁడగు విశ్వాధీడ్గురుం గొల్చెదన్

## తనయర్ధాంగి వెంకటసుబ్బమ్మగారినిగూర్చి

నాకీ జన్మములోన నోర్తె సతి నానారీతి విఘ్నంబులన్
మేకొన్నన్ నను నందినన్ పట్టుకొని యుండెన్ వర్తనంబందు
నేకోశంబున లోప మారయఁగఁ గాన్పింపంగ బో దింతయున్
శ్రీకారుణ్యుఁడు రామచంద్రుఁడు గనున్ శ్రీసుబ్బమాంబాసతిన్
మాట కఠినమయ్యు మనసు మార్దవముగానుండు చాననన్ను నోలచేరెః
వెలయు నాదు చెలువ వెంకటసుబ్బమ్మ చేత నిహపరముల చేటు సున్న

## స్వర్ణపతకములగూర్చి

వెలయ నీపురి (గుంటూరు) వైశ్యయువకసంఘమువారు
వెలయనిచ్చిన యట్టి వెండిమెడలు
పరగ నీపురి వస్త్రవర్తకులెంతయు
కూర్మి నిచ్చిన యట్టి గోల్డు మెడలు

ముద మాఱ మదరాసు పురమందుఁ బెద్దలు
కదఁగి యొసఁగిన బంగారు మెడలు
బృందావన పురంబు నందు లక్ష్మీనృసింహ
సంఘ దత్తంబు కాంచనపు మెడలు

కందనోల నిచ్చినది బంగరము మెడలు
మఱియుఁ బత్తికొండదియు ధర్మంబు మెడలు
తహి సికింద్రపురంబు స్వర్ణంబు మెడలు
కోయముత్తూరు బంగరు కొమరు మెడలు

"గంటకు నూరు పద్యము లఖండతరంబగు ధారతో సభా
మంటపమందు నిల్చి బుధమానిత రీతిని బల్కు వాఁడ మీ
వంటి సుధీంద్రు లెల్లరును "వహ్వారె" యంచును మెచ్చుచుండ
వాల్గంటుల మోవి తేనె వలె గ్రమ రసంబుల నీనుచుండఁగన్

కావలి పట్టణాన్ని గూర్చి

"కావలి సత్కవీశ్వరుల కష్టముఁ జెందకయుండుకోసమై
కావలి—దుష్కవీశ్వరులు గర్వము జెందకయుంటకోసమై
కావలి—యెల్ల పాపముల కావలి. యట్టి గుణాఢ్యమైన యీ
కావలి యందు నేఁడు రసికావళిఁ దన్పెఁ గదమ్మ భారతీ!

౧౨

వీరిః జీవితములో కార్యరంగములు మూడుమాత్రమే!
గుంటూరు మద్రాసు, విజయవాడలు.
వీరి కవితాజీవిత ప్రారంభము గుంటూరులోనే.
వీరి జీవితసమాప్తి గుంటూరులోనే
వీరి వివాహము, పుత్ర పుత్రికా
వివాహములు గుంటూరులోనే గాన
గుంటూరువారన్నను సబబే:

మద్రాసు, శ్రీపెరుంబుదూరు, కంచి, కోవెలకుంట్ల
ఉన్నతపాఠశాలాంధ్రపండితుడుగా
విజయవాడ యస్. యస్. ఆర్., సి. వి. ఆర్. కాలేజీలో పండితుడుగా
వేలకొలది ఛాత్రుల సాహితీపరుల నొనర్చిరి.

౧౩

ఆర్షమత సామాజిక వ్యవస్థ యందు
వైశ్యులకు- వేదాధ్యయనము
యజ్ఞముచేయుట, దానమొనర్చుట
కృషి, వాణిజ్య, గోరక్షణాదులు, షట్కర్మలు
ప్రధానములుగా నిర్ణయింపబడినవి.

"బ్రహ్మవైస్వం మహిమానం। బ్రహ్మణే
ష్యదధా దధ్యయన నాధ్యాపన యజన
యాజన దానప్రతిగ్రహసంయుక్తం వేదానాం గుప్త్యై—

క్షత్రే బల మధ్యయన యజన దాన
శస్త్రకోశ భూతరక్షణ సంయుక్తమ్ క్షత్రస్య వృద్ధ్యై।

వి ట్స్వధ్యయన యజన దాన
కృషి వాణిజ్య పశుపాలన సంయుక్తం కర్మణాంవృద్ధ్యై

ద్విజులలో నొకరైన వైశ్యులకు, బ్రాహ్మణ క్షత్రియులతో బాట
అధ్యయన దాన యజనములేగాక, ప్రత్యేకముగా కృషి, వాణిజ్య
పశుపాలనాదులు కులవృత్తులుగా నేర్పడినవి
—బోధాయనసూత్రమ్

అధ్యయన దాన యజ్ఞంబు లధిపవైశ్య
వకును కృత్యముల్; శుద్ధార్జనమున ధనము

సంచితవ్యంబు; పసుల రక్షించు వాఁడ
తండు వానికి నిది మహాధర్మ మనఘ
—ఆంధ్రమహాభారతము - శాంతిపర్వము

కాలక్రమేణ వీరు ఇతరులందు
గల భక్తివిశ్వాసములచే,
నాలుగైదు కర్మలం దాసక్తిని పెంచుకొనుచూ,
ఇతరములకు దూరులగుచూ వచ్చిరి.

దేశముయొక్క ఆర్థికసంపత్తిని పెంచుచూ
నవకోటి నారాయణులుగా, కోటికి పడగెత్తినవారుగా ప్రసిద్ధిగాంచిరి.

తమధనమునకు తాము ధర్మకర్తృత్వభావమును కలిగి
అద్దాని సామాజికోపయోగములకు దేవాలయ, ధర్మ
సత్రాదులకు విరివిగా నుపయోగించి;
'పురికిఁ బ్రాణము కోమటి' యను ప్రసిది బొందిరి.

సాహిత్యాదులను నిర్లక్షించిరి.
అందువలన వీరియం దుద్భవ మొందిన
కవిపండితశ్రేష్ఠులు, మహాపురుషులు
కాలవాహినిలో కలిసిపోయినవారైరి,

౧౪

ఇందుకు తార్కాణము లెన్నియో కలవు.
"పల్నాటివీరచరిత్ర" - "బొబ్బిలి మల్లమాదేవి" కథలకు గల
ప్రచారము ఈ ప్రబంధవస్తువైన
"శ్రీకన్యకాత్యాగము"నకు కలుగలేదు.

"కన్యక" యను పేరుతో, గేయఖండిక రచించి,
యిందుకు సాహిత్యమునం దొక స్థానము కల్పించిరి.
గురుజాడ అప్పారావు కవి

ఇంతవరకు ఆలిండియా రేడియోలో ఈ కన్యకచరిత్ర
కథగా గాని, హరికథగా గాని నాటకముగా గాని, నాటికగా గాని
ప్రసారింపబడలేదు - మాకు తెలిసినంతవరకు

రెండుశతాబ్దముల క్రితము, మద్రాసు ప్రభుత్వపు
ఆస్థానకవిగా, వారి వేయిన్నూటపదహారు వరహాలను
సన్మానమును స్వీకరించిన మహాపండితుడు

"శబ్దార్థకల్పతరువు" - "ఆంధ్రదీపిక" "సశేషామరకోశము"
మొదలగు నిఘంటువుల వ్రాసినట్టియు

సి. పి. బ్రౌనుగారి సాహిత్యకృషియందు వారికి సాయమిచ్చి,
వారిగ్రంథములలో "మామిడి వెంకన్న" యని పేర్కొనబడినట్టి
దిట్ట-యీ వెంకన్నశెట్టి—అనగా

మామిడి వెంకటార్యులవారు, ఆంధ్రపండితలోకములో
మఱుగున పడిపోయిరి.

గతశతాబ్దమున, మహాపండితుడుగ, వైదికసాంప్రదా
యోద్ధారకుడుగ
యజ్ఞయాగాది మహాక్రతుల నిర్వాహకుడుగ
విజయనగరమునందు న్యాయాధిపతి యుద్యోగిగ
తన్నగరాధిపతులు, ఆనందగజపతి మహారాజులుంగారి
దర్శనభాగ్యము నెంతకాలమునకును పొంద జాలక
సాహసోపేతుడై స్వయముగా నిర్భీతిగా వారి దర్బారు ప్రవేశించి.
వారి గౌరవసన్మానములంది, వారికి చిరకాలము,

అత్యంతసన్నిహితులుగ, వేదమతోపన్యాసకులుగ నుండినవారూ
మైసూరు మహారాజులంగారికి కలిగిన సముద్రయానమునుగూర్చిన
సందేహములను, శాస్త్రీయముగా నివర్తించిన

ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజులవారు
ఆంధ్రుల దృష్టిలో ఈనాడు లేరు.
విక్టోరియా మహారాణి స్వర్ణపతకము నందుకొన్నారు.
అలహాబాదులో జరిగిన ఆల్ ఇండియా సెంప్లర్సు
కాన్ఫరెన్సుకు అధ్యక్షులైరి. ఇట్టి అఖిలభారత
గౌరవమును పొందిన మొదటి ఆంధ్రులు వీరే.

వితంతూ ద్వాహసంస్కరణంలో వీరేశలింగం పంతులు గారిని
ప్రోత్సహించి, శాస్త్రాధారములను చూపించి, వారిచే మొదటి
వివాహమును చేయించినవారు వీరే. కాకినాడ పైడా వెంకటాచలపతి
గారిచే రాజమండ్రిలో వితంతు శరణాలయ నిర్మాణము చేయించిన
వారు వీరే! వీరిని వీరేశలింగం గారికి ఈ విషయములో గురువు
లనవచ్చును.

రాజమండ్రిలో ఆర్యాపురము ప్రారంభించినవారు వీరే!

జాతిపిత గాంధీకి గాని,
అమరజీవి పొట్టి శ్రీరాములకు గాని
ఆంధ్రలో, అనుపైనచిహ్నములు, ఇంతవరకు అమరలేదు.

వేలకొలది ఆటవెలదులద్వారా,
లోకానుభవమును, సాహిత్యప్రాభవమును వెదజల్లిన
వేమన్నకు ఆంధ్ర కవి కులములో స్థానములేదు.

ఈ శతాబ్దమునందే, ఆంధ్రదేశమునందు
భావ విప్లవ ప్రాదుర్భావకారకుడైన త్రిపురనేని
రామస్వామిచౌదరి
వైదుష్యము యింతవరకూ పూర్తిగా గుర్తింపబడలేదు:

కాలమహిమ ! కలికాలమహిమ !

౧౫

గుంటూరునందొకవారమందు (1919 లో గాబోలు)
జరిగిన అష్టావధాన శతావధాన సభలలో
నొకదాని యందు తమగురువుల గూర్చి

"గరువము నూని కన్నులను గానక యిచ్చకు వచ్చినట్లుగా
మొఱగెడి బండరండలగు మోరకులన్ తెగటార్చుకోసమై
చిరముతపంబు జేసి కవిసింహములై యుదయించి నట్టి మా
తిరుపతి వేంకటేశకవిధీరులకున్ తగుమా నమస్కృతుల్.

అని చెప్పుట - ఆనాటి సభ కధ్యక్షతవహించిన
కీ॥ శే॥ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారి
విశేషమన్ననలకు పాత్రములైనవి
గుప్తగారి ధైర్యసాహసములు, భక్తివిశ్వాసములు.

ఈ యిరువదవ శతాబ్ది ప్రారంభమున
ఆంధ్రదేశము నుఱ్ఱూతలూగించిన
తిరుపతి వెంకటకవుల, కొప్పరపుకవుల
ప్రతిభావ్యుత్పత్తుల వివాదము
జరిగినది గుంటూరులోనే—
గుప్తగారు పై పద్యము జెప్పిన
గుంటూరు చలమయ్య సత్రములోనే-అనగా ఆప్రదేశముననే.

౧౬

శ్రీ గుప్తగారిని ప్రశంసించి గౌరవించినవారు.

1. శ్రీ వానమామలై జియ్యరు స్వాములు
2. శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు
3. శ్రీ కూడ్లిగ శంకరపీఠాధిపతులు
4. శ్రీ మైసూరు పరకాల మఠ స్వాములు

5. శ్రీ విజయనగ రాధిపతులు
6. శ్రీ పీఠికాపు రాధీశులు
7. శ్రీ పానగల్ రాజావారు
8. శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్య
9. శ్రీ ముత్తా వెంకటసుబ్బారావు మొదలగువారు.

౧౭

అవధాన కళ ఆంధ్రుల సొత్తని ప్రతీతి.
ఈ కళయందు, కవియొక్క
పాండితీప్రతిభావ్యుత్పత్తులుగాక
వారి ధారణాశక్తి, ఏకాగ్రతలు అగ్ని పరీక్షకు లోనగును.
నూరుమంది సభ్యులు, తమకిష్టమైన విషయముపై
తమకిష్టమైన వృత్తమునందు పద్యమును గోరగా
ప్రతివారికిని, వారిపద్యప్రథమపాదమునుముందుజెప్పి,
తదుపరి వరుసగా రెండు, మూడు, నాలుగవ పాదముల
చెప్పి, చివరకు పద్యములనన్నింటిని క్రమము తప్పక
వప్పజెప్పుట శతవధాన మనబడు.

ఇట్లే వేయిమందిని కూడా తృప్తిపరచగల
సహస్రావధానులు పూర్వ ముండిరట.

ఇంతకన్నను కష్టతరమైన దష్టావధానము.
ఇందు పద్యరచన యొకానొక
విషయము మాత్రమై యుండును.
ఆశుకవిత్వము, దత్తాక్షరి, వ్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి,
పేకాట, ఘంటల లెక్కించుట, పూల లెక్కించుట.
శాస్త్రచర్చ, అప్రస్తుతప్రసంగము, చదరంగము,

సమస్యాపూరణము, కవిత్వము. ఆకాశపురాణము
మొదలగు వైవిధ్యములగు అనేకవిషయములలో ఏ
యెనిమిదింటిపైననోదృష్టి నిగిడ్చి
సభికుల మెప్పించుట - తృప్తిపరచుట.

ఇట్టి కవితాప్రదర్శకులు నానాటికి
తగ్గుచున్నను, అచ్చటచ్చట
ప్రదర్శనలు జరుగుచునే యున్నవి.
ఇట్టి అష్టావధాన శతవధాన ప్రదర్శనల
షుమారు రెండువందలకుపైగా ఈ గ్రంథకర్త
చేసినట్లు వినికిడి.

ఒకగ్రామమున (చిన్నగంజాము 1926 సం)
అప్రస్తుతప్రసంగమున, "కోమటివగు
నీవు చిల్లరబేరమును చేయక, యీ సా
హిత్యరంగమున కేల వచ్చితి వని
అప్రస్తుతముగా ప్రశ్నింప

"బేరము మాకు నచ్చినది బేరము వీడను నేను కూడ నా
బేరమనంగ భవ్యసభ పేరిట నంగడి సత్కవిత్వ వి
స్తారతరావధానపు ప్రదర్శనవస్తువు బెట్టి యిందుకున్
గోరుట మూల్యమున్ బ్రతుకు కోస మనందగు యేను వైశ్యుఁడన్
మీరిట గోరఁజెప్పితిని మీసముఁ గల్గిన యీసడింపుఁడీ!"
అని జవాబు నిచ్చి. సభికుల సంభ్రమింప జేసిరి.

ఈ యవధాన విషయమునగూర్చి తిరుపతికవులొక
చోట యిట్లు చెప్పిరి
ఒకడు గోరిన వృత్త మొకడు గోరిన వర్ణ్య
మన్యోన్య సాంకర్య మందకుండ

ఒకచిస్థానమున వేఱొకడు గూర్చున్నచో
దానిచే మార్గమ్ము దప్పకుండ
దలక్రిందుగా జెప్పవలె మాకనుచు గోర
నందులో స్ఖాలిత్య మందకుండ
మధ్య మధ్యను జెప్ప మా కిష్టమని జెప్ప
నందులో విభ్రాంతి జెందకుండ

సంస్కృతాంధ్రంబులందున శబ్దశాస్త్ర
సరణి చెడకుండ దప్పులు దొరలకుండఁ
జెప్పు శతఘంటకవివరు చిత్త మొప్పు
వాతచాలితమగు నీరజాతమువలె

౧౮

జీవితారంభమున గుంటూరులోని గుప్తగారి
మిత్రబృంద చిత్రము ఈ గ్రంథము
నలంకరించుచున్నది. అందలి
రేకపల్లి భాస్కరరావు, ఉప్పుటూరి వీరరాఘవయ్య
ఉప్పుటూరి వెంకటపున్నయ్య. గ్రంధి సుబ్బరాయశర్మ
ఆకుల వెంకటరత్నంగారలు ఈనాడు లేరు.

వీరిలో ముఖ్యులు సుబ్బరాయశర్మ(గుప్త)గారు
ఎనలేని సంఘసేవ చేసినవారు.
నిరంతరము దరిద్రతాపీడితులయ్యునూ
నిరంతరము సాంఘికసేవాలోలురై యుండేవారు.
అనేకములైన పరిశోధనలు చేశారు. గ్రంథాలు వ్రాశారు.
మధ్యప్రదేశ్‌లోని బాందా ప్రాంతములోని
కుగ్రామములు పర్యటించి, అచ్చట వైశ్యుల పుట్టు
పూర్వోత్తరముల శోధించి, వారిపేరులు, యింటిపేరులు

పరిశీలించి, తెలుగుదేశమునుండి వలసవెళ్లిన
వైశ్యులనే నిర్ధారించిరి. వారిలో మంచి ప్రబోధము చేసిరి.



కవి గజ గండపెండేర సన్మానము—

శ్రీ గుప్తగారికి 1949 వ సం॥ మే నెల రెండవతేదిన విజయవాడ పురమందు అత్యంతవైభవోపేతముగా జరుపబడింది. ఈ సభకు అప్పటి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులు గౌ॥ ఆర్. బి. రామకృష్ణరాజుగా రధ్యక్షత వహించారు. శ్రీ కళాప్రపూర్ణ కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు సభను ప్రారంభించారు. ఆర్యవైశ్య మహాసభాధ్యక్షులు శ్రీ పైడా వెంకటనారాయణగారు (జమీందారు, శాసనసభ్యులు) గండపెండేర, సువర్ణపాత్ర, సన్మానపత్రసమర్పణ గావించారు. ఇచ్చటనే వీరికి గజోత్సవము జరుపబడింది.

స్థానిక ప్రముఖులు శ్రీయుతులు
మనికొండ వెంకటనరసింహం
కాశీవిశ్వనాథం గారలచే
కనకాభిషేక గౌరవము జరుపబడింది.



గుప్తగారి కవితాప్రదర్శనకు
అవధాన నిర్వహణకు కారణభూతులు
ఆర్యవైశ్య యువకుల సాహితీ సంఘము
గుంటూరు (స్థాపితము 1915) వారే :
అందులో ముఖ్యులు

1. గుంటూరు నరసింహారావు (ప్రస్తుతము-మద్రాసు)
2. జమిలి నమ్మాళ్వారు
3. ఉప్పుటూరి వెంకటపున్నయ్య (కీర్తిశేషులు)

అనాడు ఈ ముచ్వురను ఇన్‌సపరబుల్ ట్రినిటీ (Inseperable Trinity) 'విడదీయరాని త్రిమూర్తుల'ని మిత్రులు, అభిమానులు పిలిచేవారు.

౨౧

కావ్యప్రయోజనాలు ఆనందము - ఉపదేశమని
ఆలంకారికుల అభిప్రాయము.
ఉపదేశము - ప్రభువువలె శాసించునది
మిత్రునివలె సలహాల నిచ్చునది
భార్యవలె మనోరంజకంగా ఉల్లాసాన్ని కలిగించునది
అని మూడు విధాలు.
ఈ గ్రంథము పురాణముగా పేర్కొనబడినది
అందువలన మిత్రసమ్మత మనవచ్చును.
అయినను కావ్యరూపమునంది నందువలన
కావ్యలక్షణముకలిగి, ఆనందకారిణి యగుచున్నది.
కవి కావ్యాన్ని సృష్టించ గలుగుతాడు.
సహృదయులు దానిని జీవింప జేస్తారు.
పూవు తావిని కలిగియుంటుంది, దానిని
వాయుదేవుడు, జనుల
కందించి, వారికి హాయిని కలుగజేస్తాడు.
అలాగే!

ఈ కావ్యం సర్వకాలాలు ఆంధ్రరసికజనమనోవీథుల
శాసిస్తుందని యాశించు

కీలక - చైత్ర శుద్ధ ౧
శుక్రవారము
౨౯-౩-౬౮

అగ్రహారము - గుంటూరు-3

## విమర్శాలేశము—

ఆర్యవైశ్యులయొక్క కులదేవత యని విఖ్యాతినొందిన శ్రీ కన్యకాపరమేశ్వరిని గూర్చిన శ్రీ కన్యకాపురాణము అను పేరిటి గ్రంథము లెన్నో యున్నవి. అందు కొన్ని సంస్కృత గ్రంథములుగాను - కొన్ని తెలుఁగు పుస్తకములుగాను ఉన్నవి. సంస్కృతపుస్తకములు శ్లోకరూపముగాను- తెనుఁగు పుస్తకములు పద్యరూపముగాను ఉండుట సాధారణము. వచనగ్రంథములు - నాటకరూపములు ఇటీవలివి.

ఈ యన్ని పుస్తకములును పలువురు గ్రంథకర్తలచే వ్రాయఁబడుటచే ఒకరీతిగా నుండక భిన్నభిన్నములయినవిగా నున్నవి. అయినను రాజరాజనరేంద్రుని తండ్రి యయిన విష్ణువర్ధనుని కాలమున పడమటి గోదావరిజిల్లా లోని పెనుగొండ పురమునందలి ప్రముఖవైశ్యుఁడయిన కుసుమగుప్తుని కౌమార్తె కన్యకాంబ యనియు - విష్ణువర్ధనుఁ డామెను మోహించి - ఆమెను తన కిచ్చి వివాహము చేయవలె నని ఆమె తండ్రిని నిర్బంధము చేయఁగా - వైశ్యులందు కొప్పుకొనక - మానధనులై ఆమెతోఁగూడ నగ్నిప్రవేశము చేసి రనెడి విషయమున పుస్తకము లన్నియు నేకీభవించుచున్నవి. మిగిలిన యంశము లెట్లో సరిపెట్టుకొనవలసియున్నది.

ఆంధ్రులయందు పలు లక్షల జన సంఖ్య గల్గి మిక్కిలి ప్రాముఖ్యమయిన శ్రీమంతులై - ధార్మికులయిన యార్య

వైశ్యుల చరిత్రకు సంబంధించిన యీ ముఖ్యాంశము అంత గాని కొంత గాని నేను చదివినంతవఱకు వాడుకలో నున్న దక్షిణహిందూదేశచరిత్ర గ్రంథములలో కనుపడ లేదు. అనేకులయిన స్నేహితులయొక్క యభిప్రాయమును అదియే. అట్లని నంతమాత్రమున దేశమునందు ఇంత పలుకుబడిని సంపాదించిన యీ చరిత్రము కేవలము కట్టుకత యన వీలగునా? కట్టు కత యని గూడ తలంచు వారు కొందఱున్నారు. అట్లయినచో,

"నిజము నిడిని మీఁద తేలును"

అనెడి నీతిప్రకారము సుమారు 7 – 8 వందల సంవత్సరముల క్రిందట ఈ పురాణముయొక్క తొలుతటి పొత్తము వ్రాయఁబడినది. అందు నిజ మే మాత్రమును లేనిచో అది యొక రూపముతోనో పలురూపములతోనో యింత కాలము జీవింపఁగలదా?

అనెడి ఈ జిజ్ఞాస పలువురను కలవరపెట్టుచుండఁగా – ఆర్యవైశ్యరత్నములయిన—

శ్రీ రా. బ. తుంపూడి భగవంతము గుప్తగారు (రిటయర్డు జిల్లా కలక్టరు – విమర్శకాగ్రేసరులు) మదరాసు వాస్తవ్యులు – ఈ యంశమును గూర్చి "థర్స్టన్" మొదలయిన చరిత్రపండితుల గ్రంథరాజములను పరిశోధించి యనేకాంశముల నిందులకు సంబంధించిన వానిని సంపాదించి ప్రచురించినారు. అవి యన్నియు చాలవఱకు వ్యాప్తి నొంది యున్నవి.

అందువల్ల,

పురాణరూప పుస్తకములయందలి యభిప్రాయముల కును - శ్రీ భగవంతము గుప్తగారివంటి విమర్శక రత్నములు సంపాదించిన యభిప్రాయములకును సమీకరణమయిన యొక గ్రంథమును శ్రీ కన్యకాంబాచరిత్రముగా వ్రాయుట అనవసరము గాదు.

ఇట్లు నాకును మన మిత్రులయిన నరసరావుపేట వాస్తవ్యులు శ్రీ మాజేటి పూర్ణచంద్రరావుగార్కిని, గుంటూరు వాస్తవ్యులైన శ్రీ జమిలి నమూశ్వార్లకును తోఁచినది. నన్ను ప్రోత్సహించిరి. ఆ కారణమున ఆ చరిత్రమునుగూర్చి నాకు తోఁచిన కొన్ని యంశములను మనవి చేసికొనుచున్నాను.

శ్రీ కన్యకా పరమేశ్వరి ఆర్యవైశ్యుల కులదేవత యగుట - ఆమె యవతరించుట రాజరాజనరేంద్రుని తండ్రి యగు విష్ణువర్ధనుని కాలమునందే - అంతకు ముందామె యునికి లేదనుట

"ఏటి యావల ఊళ్లు లేవు"

అన్నట్లుండును. చాళుక్యరాజులయిన విష్ణువర్ధనాదుల కాలమునందు సనాతనమతము దక్షిణహిందూదేశమునందు పునరుద్ధరింపఁబడిన దనియు - ఆ ప్రయోజనముకొఱకే రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టుచే మహాభారతము నాంధ్రీకరింపఁ జేయఁ బ్రారంభించె ననియును, పలుకుట సుప్రసిద్ధాంశము. అంతవఱకు దేశమంతటను జైనబౌద్ధమతములు గాఢ

ముగా వ్యాపించియుండినవి. అందులకుఁ బ్రబలమయిన దృష్టాంతములు:-

ఆంధ్ర దేశమునం దంతటను గనుపట్టును - నాగార్జున కొండ - అమరావతి - హనుమకొండ - మొదలయిన స్థలములయందలి స్తూపములు - శిల్పములు మొదలయిన వెన్నో కలవు. కొందఱి అభిప్రాయము చొప్పున పురాతన దేవాలయములు చాలవఱకు జైనమతమునకు సంబంధించిన వని దృఢమయిన విశ్వాసము కలదు. క్రీ. పూర్వము 2 వ శతాబ్దిలో శ్రీశైలముగూడ గిరి జారామమను పేరి జైనవిహారముగా నుండిన దనెడి అభిప్రాయమును కొందఱు తెల్పియున్నారు.

పైని కారణమువలన ఇట్లు తలంపవలెను:- చాళుక్యులకుఁ బూర్వ మీ దేశము చాలవఱకు జైనబౌద్ధమతాక్రాంతమై యుండెడిది. జైనులలో తీర్థంకర తీర్థంకరీ పూజలుండుట సహజము. అట్టి జైనుల దేవాలయములును విగ్రహములును అనేకములు. దేశమునందు సనాతనమత పునరుద్ధరణ ప్రబలముగాఁగ పౌరాణిక దేవతానామముల నొందినవనియు చరిత్ర పరిశోధకులు నిర్ణయించియున్నారు.

ఆర్యవైశ్యులు సుమారు 4 - 5 వేల సంవత్సరముల క్రింద హిమవత్పర్వతములలో - ''మహాగిరి'' యనెడి శిఖరము నాశ్రయించి యుండి రనియు - వా రప్పుడు బహుశః జైనమతావలంబు లనియును - కన్యకాదేవి యనెడి తీర్థం

కరిని (యోగినిని) వారు పూజించుచుండిరనియు ఒక నిర్ధారణము గలదు. జైనులయందలి తీర్థంకరి బ్రహ్మచారిణిగా నుండును. గనుక కన్యక యనెడి పేరు సార్థకము.

"కన్యక" యనఁగా అవివాహిత యనియు అనాగతార్తవ యనియును 8 ఏండ్ల బాలిక యనియును నర్థములు వాడుకలో నున్నవి. దేవీపర్యాయముగా ఆ నామధేయము సనాతనపర్యాయముగా వాడఁబడినప్పుడు–అనీశ్వరి యనఁగా ఆదిశక్తిస్వరూప మనియు–ఆమె పైనిఁక నొక యధికారి యుండఁ డనియు చెప్పబడుచున్నది.

పై వాదము వలన "కన్యకాదేవి" ఆర్యవైశ్యులకు ఆదినుండియు వారు ఈ సనాతనమతావలంబనము నొందని యప్పటినుండియు సంపూజితగా నుండినట్లు తెల్లమగు చున్నది. ఆర్యవైశ్యులు హిమాలయములయందు మహాగిరి ప్రాంతమును విడిచి దక్షిణ హిందూదేశమునకు వచ్చి పలు చోట్ల వలస లేర్పాటు చేసికొనిరి. వారు కొండలలో నుండి నప్పుడు సహజముగా పాశుపాల్యము వారి వృత్తి యై యుండును. కొండలను విడిచి మైదానపు దేశభాగములలోనికి రాఁగా–వారికి వాణిజ్యముగూడ వృత్తి యై అందే వారు ప్రాధాన్యము వహించిరి. అనుటలో కృషి గోరక్షణములును వారికి నుండిన వనియే తలంపవలెను.

వలసపోయివచ్చిన ఈ జైనమతావలంబులకు గోదావరీ ప్రాంతమును పడమటి కనుమలలో నొక ప్రదేశమును ఉనికి

పట్లయినవి. వీ రెక్కడకు వెడలినను వీరి నివాసములకు తమ యాదిస్థానపు గుర్తుగా తత్థలమునకు "మహాగిరి" యర్థము వచ్చు పేరు నుంచుచు వచ్చిరి. గోదావరీమండలములోని పెనుగొండయును - మైసూరురాష్ట్రములోని దొడ్డబెట్టయును అట్టి పేరులే కావలెను!

ఆదినుండి వీరు జైనమతావలంబు లనుటకు వీరు మొదటినుండి శాకాహారులుగా నుండుట యొకనిదర్శనము మఱియును దొడ్డబెట్ట ప్రాంతమున నిప్పటికిని జైను లనేకు లున్నారు. కర్ణాటకభాషయందు షడక్షరదేవుఁడు మొదలయిన కవీశ్వరులు జైనులు. చాళుక్యాది భూపతుల ప్రోత్సాహమున పునరుద్ధరింపఁబడిన సనాతనమతము నీ జాతి యవలంబించుటవల్లను వీరు ముఖ్యముగా వైశ్యధర్మముల నవలంబించియుండుటచేతను వీరు వైశ్యు లనఁ బడవలసిన వారయిరి. ఈ స్థితికి గోదావరి యుత్తరపినాకిని నదుల ప్రాంతముల వారే పాల్పడిరి. దొడ్డబెట్ట ప్రాంతము వారు చాల వఱకు జైనులుగానే యున్నారు.

కాఁబట్టి - చరిత్రసామగ్రినిబట్టి తొలుతటినుండి కన్యకాంబ యార్య వైశ్యులయొక్క కులదేవత యనియును వీరి మతము జైనమునుండి సనాతనము (హైందవము) గా మాఱినను వీరు కులదేవతాపూజనము మాన లే దనియును - అది వీరి జాతియొక్క విలక్షణ లక్షణ మనియును తెలియుచున్నది.

పరిశోధన నాధారపఱచికొని యింకను గొన్ని సంగతులను నిర్ణయింప వీలగుచున్నది. ఈ దేవతకు కన్యకాంబ

యని పేరు వచ్చుటకు మఱియొక కారణముగూడ ఉపబలము గా నున్నది.

కుసుమగుప్తుని కూతురు అగ్నిప్రవేశ మయినది. ఆమెయే కన్యకాపరమేశ్వరి యవతారమనిరి. ఆమెకు వాసవాంబ యని (మఱియొక) పేరు గలదు. అదియే యామె పుట్టు పేరు.

ఆర్యవైశ్యులు ఎక్కడ నెలకొనినను ఆ నెలకొనిన పురమునందు సాధారణముగా నొక కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయ ముండును. అందలి దేవత నర్చించుటకు నిప్పటివలె నొక యర్చకుఁడు గాక యొక యర్చకురా లుండెడిది. ఆమె యెవరో గాక ఆ పురపు వైశ్యులయందలి కుల పెద్దయొక్క జ్యేష్ఠపుత్రిక యై యుండెడిది. ఆమె ఆ జన్మాంతము అవివాహితగా నుండి యందలి పూజావిధులు నిర్వహించుటయును - భక్తు లందఱును ఆమెచే దేవతాప్రసాదములు స్వీకరించుచుండుటయును జరుగుచుండెడిది.

ఈ పద్ధతి జైనమతములోని తీర్థంకరీపూజ లేక యొక విధమయిన శాక్తేయ మనియు తోఁచు వీలునుగల్గించు చున్నది. వామాచారపద్ధతి గల శాక్తేయమా ? కాదు. ఎందు కనఁగా ఇందు జీవజంతుబలి యే మాత్రమును లేదు. గ్రీసు దేశమునందుఁ గూడ పూర్వము దేవతార్చనకై యొక్క యాజన్మాంతకన్యక నియోగింపఁబడుటయు ఆమెద్వారా భక్తులు దేవతయొక్క యాజ్ఞలు తెలిసికొనుటయు జరుగు చుండెడిది.

Oracle of Delphi "Legends of Greece and Rome" ఇందులకు నొక యుదాహరణము..

విష్ణు వర్ధనుఁడు తన రాజ్యమునందు నున్న పెనుగొండను గాంచ వచ్చి యందలి వైశ్యులచే దేవాలయమునకుఁ గొంపోఁబడి యక్కడనుండిన యర్చకురా లగు వాసవి (కుసుమగుప్తుఁ డనెడి ఆ యూరిపెద్ద యొక్క తొలి కుమార్తె) చేత దేవతాప్రసాదమును గైకొని యామెను గాంచి మోహించి యామెను వివాహ మాడఁ గోరెను.

ఆ యూరు ఆ చుట్టుపట్ల నున్న 18 వైశ్యపట్టణములకును గొప్పదియై నాయకత్వగౌరవము నొందియుండెను. ఆ పురమునందును దానికడను గల 17 పట్టణములయందును 102 గోత్రముల వారగు ఆర్యవైశ్యు లుండిరి. వారే యిప్పుడు భారత దేశమందుఁ గల యార్యవైశ్యులందఱికి మూలపురుషులన నొప్పు. వారు బేరసారము(మెట్టబేరము – ఓడబేరము)ల యందును బాహువిక్రమ దానధర్మ విద్యాయోగ్యతల యందును మిక్కిలి వన్నెవాసితో నుండఁగాఁ గాంచి యిక్కడికి వారు రాకమునుపటినుండి యుండిన 612 గోత్రములు ఇతర (బేరి–నూనె–గాజుల మొదలయిన) వైశ్యజాతి వారు ఆర్యవైశ్యులతో కలసి మెలసి యుండఁబూనిరి.

విష్ణువర్ధనమహారాజు విని మోహించె ననిన కారణమున ఆ కన్యక కేవలము "అష్టవర్షాత్ భవే త్కన్యా" అనెడి వాక్యముపయిన నాధారపడఁదగినది గాక – అవివాహిత యనియును, నవయౌవనవతి యనియును తలంప

వలయును. ఆమెను విష్ణువర్ధనుఁడు గోరినంత - ఆర్యవైశ్యులు తబ్బిబ్బు నొంది - అనులోమ వివాహపద్ధతి ప్రకారముగా అది తగు నని తోఁచినది గాని___

దేవీపూజకు సంకేతురాలయిన కన్యక నితరుల కిచ్చుట న్యాయవిరుద్ధమను ఆత్మగౌరవమునకు భంగమును అగును. గనుక ఎట్టి చిక్కులు వచ్చినను ఆ కన్యకను రాజున కీయ వీ లుండ దనియును, ఆమెను గాక మ ఱొక కన్యక నయినచో రాజున కిచ్చు విషయ మాలోచింప నగును అని యును నిర్ణయించిరి. ఈ విషయము పయినుండి వచ్చిన ఆర్య వైశ్యుల సంగతి.

ఈ వైపున నుండిన పలువితములయిన 612 గోత్ర ముల వైశ్యులు ఉత్సర్గాపవాదపద్ధతిని (విశేషశాస్త్రాంశము వచ్చినప్పుడు సామాన్యశాస్త్రాంశము కొట్టువడును)

"నా విష్ణుః పృథివీపతిః."

అనగా రాజనఁగా విష్ణ్వంశము గదా? అతని యాజ్ఞను ధిక్కరింప రాదు. ఇట్టి సందర్భమున వెఱ్ఱి వెఱ్ఱి యూహాలను బురస్కరించుకొని రాజుతో ద్వేషమును కల్గించు కొనుట మిక్కిలి యపాయకరము - న్యాయాంకితమైన నగర పాలన నిపుణత. అని పలికి - 102 గోత్రముల వారితో నైక్యము నొందక - యా యూళ్లకు రాజు యుద్ధార్థము సేనలనుఁబంపినచో అపాయకర మనెడి భావముతో అక్కడి నుండి యెన్నో యెడలకు పరారి చిత్తగించిరి. "వారు జేరి

నూనె - లోనగు నానావిధముల వారు మాంసభక్షకులు-"
అని వాడుక వినఁబడుచున్నది.

రాజేందుఁడో రాయబారులను బంపెను. అట్లు వచ్చిన వారెవ్వరయినను సరే - ఆర్యవైశ్యుల వైదిక విజ్ఞాన సంపత్తి - సదాచారనియతి - కృషివాణిజ్యాది కుశలత-దాన ధర్మ - పరోపకారాది సద్గుణములను జూచి - యత్యంతాశ్చర్యసంతోషములను జెంది - వారియందు గౌరవమును వహించి యక్కడనే యుండుచు వచ్చిరి.

ఈ సందర్భమున కొన్ని సేనలనుగూడ రాజు వైశ్యుల పురమునకు పంపినాఁడు. వారుగూడ ఆర్యవైశ్యులయొక్క యోగ్యతలు గాంచి ముగ్ధులై - వారినే యాశ్రయించి యుండుట యోగ్యత యనియును - కేవలము తుచ్ఛ కామ వివశుఁడయిన రాజునకు లోఁబడుట సరి కాదనియు తలంచి పెనుగొండలోనే యుండిరి. వారికిని వారి వంశీయులకును ఆర్యవైశ్యులు అభయ మొసంగిరి. అట్టి భటుల సంతతి వారే నేఁటి వీరముష్టులు - వాసవీకన్యతో నగ్నిప్రవేశము గావించిన 102 గోత్రముల వారిచిహ్నములుగా ఇత్తడి శిరస్సుల బొమ్మలతో నలంకరింపఁబడిన ప్రభలతో ఆర్యవైశ్యుల యిండ్లయందలి శుభకార్యములకు వచ్చి బహుమానము లందుచున్నారు.

ఇట్లే బ్రాహ్మణులను విప్రవినోదులును -
క్షత్రియులను బట్రాజులును -

విశ్వబ్రాహ్మణులను రుంజాలవారును - గొల్లవారిని పిచ్చుగుంట్లు మొదలయిన పద్ధతులుగా నాశ్రయించి బహుమానములను గొందురు. తత్తథాస్తు.

రాజు మిక్కిలి గొప్ప సైన్యముతో యుద్ధమునకు వచ్చుచున్నాఁడనఁగా - రాజుతో ఎంత యుద్ధము చేసినను జయము గల్గుట దుర్లభము కాన-

"ప్రాణం వాపి పరిత్యజ్య మాన మేవాభిరక్షయేత్"

అనెడి నీతిప్రకారముగా ఆ నూట రెండు గోత్రముల వారును వాసవీకన్యతోఁగూడ అగ్నిప్రవేశము చేయందలంచిరి. 102 కుండములు త్రవ్వఁబడి యందగ్ని రగుల్పఁబడినది.

వాసవీకన్యకా ముఖమున (శ్రీ) కన్యకాపరమేశ్వరి యార్యవైశ్యుల నుద్దేశించి యిట్లు పల్కినది.

"మీ యిండ్లయందు నిరంతరము లక్ష్మీసరస్వతులు తాండవింతురు గాక-

"లేమి యనునది మీయెడ లేమిగా నుండును గాక-

"ధాన - ధర్మ - పరోపకార - దైవభక్తి - దేశభక్తి - దీనరక్ష - ణాతిథ్యభ్యాగతపూజ నాది సత్కార్యములయందు మీ శ్రద్ధ పెంపొందుఁ గాక-

"విద్యా - పరిశ్రమ వాణిజ్యములు - మీవల్ల దేశము నందు రాణించి - ఖండఖండాంతరములయందు మీ పేరు వ్యాప్తిం జెందుగాక-

"ధైర్య పరాక్రమములయందును హాలసంపదయందును బలసంపదయందును మీరు పెట్టిన పేరగుదురు గాక.

"దేశ దేశములయందును మీ కుటుంబములు తామర తంపరలుగా వ్యాపించి యెల్లరీతులను వర్ధిల్లవలెను."

"సర్వవిధములయిన రాజసన్మానాలకు మీరు పాత్రులు గావలెను. మీతో రాజాధిరాజులు రాణింపవలెను. మీతో అఖండ పండితులును, మహాకవీశ్వరులును, జగద్గురు ప్రాయ జ్ఞానసముద్రులును మిక్కిలిగా ప్రకాశింపవలెను- వేయేల ? మీకు లేనిది లే కుండునుగాక-"

"యజనాధ్యయన దాన కృషి వాణిజ్య పశుపాలనాది షట్కర్మనిరతులై ధర్మోద్ధరణ దీక్షాబద్ధులై యుందురుగాక-

ఈ వాసవీకన్య ముఖమున నే నీ వరములను మీకుఁ బ్రసాదించుచున్నందునను, కులాభిమానమును - దైవభక్తియును - ధర్మక్రియయును ప్రకటితము లగుచున్నవి గనుక - నాకు ఇఁకమీఁద "వాసవి - వాసవాంబ - కన్యకాపరమేశ్వరి" యనెడి పేరులు లోకవ్యాప్తము లగును గాక" అని - ఈ మొదలయిన యుత్తమవరములను దేవి ప్రసాదించినది. కాని-

తన పాదారవిందముల యందు భక్తి గల్గి కులాభిమానమును - ఐకమత్యమును ధర్మశ్రద్ధలను బ్రకటింపుచు నగ్నిప్రవేశము నొందిన తన వంశీయులయిన యార్యవైశ్యులలో

"తనవంటి యత్యంత సౌందర్యయుక్త యుండుట వల్లనే యొకళ్లకుఁ దనయందు వ్యామోహము గల్గి యింతటి విపత్తునకుఁ గారణ మయినది గనుక ఇఁకను ఆర్యవైశ్యులయందు కుంటిగానో - కురూపిగానో - గ్రుడ్డిగానో పుట్ట వలెను గాని సర్వాంగసుందరులు జన్మింపరాదు" అని శపించినదఁట. అంతే గాక - వీరు మేనమామ కూఁతురును విధిగా వివాహ మాఁడవలసిన మేనఱికపు ధర్మ మొక దానిని కట్టడ చేసిన దఁట. రక్తసంబంధమయిన వివాహములు పెరుగుట వల్లనే సంతానమనారోగ్యము గాను నుండు ననియును అట్టి సంతానముల వలన వంశము నానాఁటికి నెల్ల రీతులను క్షీణించు ననియును వైద్యప్రమాణము గలదు. ఈ రీతిగా వంశనాశమునకు దారితీయు శాపములను కులదేవత కులస్థులకు నిచ్చునట్లు నేను జూచిన కన్యకా పురాణగ్రంథములు కొన్నిటిలోఁ గలదు. వంశమునకుఁ జిక్కులు గల్గునట్లు శపించిన వ్యక్తిని దేవతగా పూజింపవలసినట్టి విధి వైశ్యుల కెందుకు? అట్లు గావించినచో వారికన్న అజ్ఞాను లెవ్వరు? మేనఱికపుఁ బద్ధతి యార్యవైశ్యుల లోని కెట్లు వచ్చినదో స్థలాంతరమున యోచింతము గాక—

శ్రీ వాసవి తన భక్తులగు 102 గోత్రంబుల ఆర్యవైశ్యులతోఁ గుండప్రవేశము చేయుచుండగా కుసుమగుప్తుని

కుమారుఁడగు విరూపాక్షుని నాయకత్వమున బాలనగరులు ఒక ద్వారమునఁ బురములోనికిఁ బ్రవేశించుచున్న రాజ సైన్యము నెదుర్కొని యా సైన్యము నోడింప సాఁగిరి.

ఈ సందర్భమున మఱియొక శంకగూడ పొడము చున్నది-"పరిత్రాణాయ సాధూనాం। వినాశాయ చ దుష్కృ తాం। ధర్మసంస్థాపనార్థాయ। సంభవామి యుగేయుగే॥" అని శ్రీ భగవద్గీత యందు అవతారలక్షణము తెల్పంబడినది. శ్రీ కన్యకాపరమేశ్వర్యవతార మీ లక్షణమునకు తృప్తికర ముగాఁ బొందు పడవలెనుగదా?

మఱియొక ద్వారమున విష్ణువర్ధనుఁడు పురములోన బ్రవేశించి అగ్నికుండములందుఁ బీనుఁగులుగాఁ గాలి పడి యుండిన స్త్రీ పురుషులను జూచి దిగాలుపడి తలపగిలి మర ణించెను. ఇదియే యా రాజునకు ఆ యమ్మవారియొక్క శాప మని పొత్తములలో కనుపడుచున్నది.

పెనుగొండ నగరమును ఆ పొంతల నున్న యితరము లయిన 17 పేఁటలను రాజసైనికులు ఛిన్నభిన్నములను గావించి నందునను తమ పూర్వులు భీకరమయిన యగ్నిప్రవేశము నొందినను, బాలనగరులు రాజుసైన్యములను ఒక భాగమున జయించినను - పిదపను రాజుసైన్యములచేఁ గష్టములు కల్గ వచ్చు నని యడవులను బ్రవేశించిరి - తమకు గూఢచారులు మొదలయిన వారి మూలమున బాధలు గలుగకుండుటకు గాఁబోలు ఋషిగోత్రములకు బదులుగా సాంకేతిక గోత్ర నామములను ధరించినట్లు తోఁచుచున్నది.

ఈ రీతిగా భాలనగరులు తల్లిదండ్రులను గోలుపోయిరి. 102 గోత్రములలో 1 గోత్రము వారికి సంతతి లేనందున ఆ కుటుంబికి లాభ మను పేరు నిచ్చి వైశ్యులు తమ బేరములలో కొలతల లోను తూకముల లోను ప్రారంభములయందు ఒకటికి బదులుగా లాభము - రెండు అని లెక్క పెట్టునట్లు నిర్ణయించుకొనిరి. వారందఱును కొంతకాలమునకు విరూపాక్షుని తమ కధ్యక్షునిగాఁ జేసికొని పెనుగొండలో ప్రవేశించి పూర్వమువలె నగరపాలనను స్వీకరించిరి. రాజరాజనరేంద్రుఁ డప్పుడు దేశమును పాలించుచుండెను.

ఇట్టి అస్తవ్యస్తపరిస్థితులలో వీరికి వైదికకర్మవిచ్ఛిత్తికొంత కల్గియుండవచ్చును. ఈ సంఘమున కిట్టిచిక్కు గల్గుటనుగూర్చి యప్పుడున్న పీఠాధిపతు లేల గమనింప లేదు?

పిదప - 50 సంవత్సరములకు పయిఁగాను వంద సం॥లకు లోపుగాను భాస్కరుఁ డను నొక విప్రుఁడు తనకు తెలిసిన సంగతులతో (శ్రీ) కన్యకాపురాణ మనెడి పుస్తకమును వ్రాసినాఁడు. దానిని కేవలాంశములతోఁ గాక పౌరాణిక ఫక్కిగా వ్రాసి - యప్పటి కుండిన యార్యవైశ్యులందఱిని తన శిష్యులనుగాఁ జేసికొన్నాఁడు. తాను గురువై ఆ శిష్యులుగా నేర్పడినట్లు తా నుచ్చరించిన యార్యవైశ్యుల కతఁడు గావించిన యుపదేశ మే మనఁగా - ఆర్యవైశ్యులకు తత్పూర్వ ముండిన-

"ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవశ్చ ధీమహి ధియో యోనః ప్రచోదయాత్"

అనెడి గాయత్రీమహామంత్రముతోఁ గూడిన వేద మంత్రములు గాక - "అంగుళ్యాగ్రే. నాసికాగ్రం సంపీడ్యం పాపనాశనమ్. ప్రాణాయామ మిదం ప్రోక్తం ఋషిభిః పరికల్పితమ్"-వ్రేళ్ళ కొనయందు ముక్కు కొనను నలిపికొన్న పాపము పటాపంచలగును. ఇది ప్రాణాయామ మని ఋషులచే నేర్పాటు చేయఁబడినది - అను రకపు మంత్రములను నేర్పాటు చేసి యది వేదోక్తముగాదు పురాణమని పేరుపెట్టి వారికి కేవలము అభినయరూపమయిన యర్థహీనమయిన **యాచారముల నుపదేశించినాఁడు.**

కన్యకాపరమేశ్వరీ దేవాలయమున నతఁ డర్చకుఁడుగాఁ గూడఁ గుదురుకొన్నాఁడు. కాని యిక్కడ నొక యంశము గమనింప వలసియున్నది. ఆర్యవైశ్యులకు నుండు విప్రభక్తి కొలఁదిని అనేకపురములలోఁగల శ్రీ కన్యకాంబా దేవాలయములలో విప్రార్చకులే యున్నారు. కానివారు ఆ దేవి తీర్థప్రసాదములను స్వీకరింపరు. పూజాసమయమున **ఆమెను** "కన్యకాంబ-వాసవాంబ" **యనక** "రాజరాజేశ్వరి" యందురు. ఈ యంశమును నే ననేక స్థలములయందు గమనించినాను. దీనికి కారణము ఆ విప్రులకు అమ్మవారియందు దేవతాభావము లేకుండుటయేగాక యే మగును? దానికిఁ దోడుగా అమ్మవారియందు భక్తి హెంపునఁ గొందఱు వైశ్యులు ఒకచోట అమ్మవారి సన్నిధిలో మంత్రపుష్పము చెప్పఁ బూన అందలి అర్చకులు వారితోఁ కలిసి చదువక మానముగనుండిరి, ఇది యెంత శోచనీయమో చెప్పనేల?

శ్రీ కన్యకాపురాణ మన వచ్చునా? యను నది మఱి యొక ప్రశ్న. పురాణ మన్నచో సర్గ - ప్రతిసర్గ-వంశ-మన్వంతర - వంశానుచరితము లనెడి పంచలక్షణము లందు నున్నవా? ఆ సందేహ మట్లుండఁగా - ఇది శ్రీ స్కాంద పురాణాంతర్గమయిన దని చిత్తూరు శ్రీ వాటంబాటి వారు ప్రచురించిన ప్రతిలో నున్నది. శ్రీ గ్రంధి వేంకటసుబ్బరాయ శర్మగారు విమర్శింపుచు ఆ పురాణమునం దది లేదని వారు రచించిన శ్రీ మామిడి వేంకటార్యులుగారి జీవిత మనెడి పొత్తము 65 వ పుటలో తెలిపియున్నారు. గనుక పురాణ మనెడి శబ్దమునకు నిచ్చట ఒక "ప్రాతవస్తు" వనుకొన్నచో సరిపడు నని తోఁచుచున్నది. కొన్ని పద్ధతులలో నిది పురాణమువలె నున్న దనుకొనవచ్చును. మార్కండేయపురాణమును - శ్రీ గాంధీ చరిత్రముల యక్షగానములును హరికథ లనఁబడుచున్నవి. హరికథా పద్ధతిలో రచింపఁబడినవి గాని యందు హరి విషయములు కానరావు-

శ్రుతి ననుసరించునది స్మృతి. దాని ననుసరించునది పురాణ మని సూక్తి.

ఈ శ్రీ కన్యకాపురాణమునందలి యితివృత్తముగూడ మిక్కిలి పవిత్రమయినది.

ఇప్పటిలోఁ గొంద అనుకొనెడి రీతిగా ఆర్యవైశ్యులు ఆత్మగౌరవము ధైర్యస్థైర్యములు లేని వారు కారు. రాజు మాటలకు బెదరి వారు మత ధర్మమును - "ఏ యెండ కా గొడుగు" - "ఏ త్రోవ కాపాట" అన్నట్లు నేడు

కాంగ్రెసు పార్టీ - తేఁపు జస్టిసు పార్టీ - మఱునాడు టీ పార్టీ" యన్నట్లు రంగులను కేవలైహిక సుఖాభిలాషులై మార్చు చేయలేదు సరిగదా? రాజపుత్రస్థానమునందలి యుత్తమక్షత్రియులు తమకు జయము దుర్లభ మని తోఁచి నప్పుడు పరుల చేతిలోఁ బడి లొంగుట కిష్టపడక 'జోహారు' పద్ధతిని కోటలోఁగల స్త్రీలును వృద్ధులును తమ ప్రాణ ముల నగ్ని కర్పణము గావించిన వార్తలను కేవలము ఆత్మ గౌరవ రక్షణాభిప్రాయ ప్రధానమయిన యార్యవైశ్యల యగ్నిప్రవేశ కథ స్ఫురింపఁజేయుచున్నది.

ఇట్టి దివ్యచరిత్రమునకు నాయకమణియయిన శ్రీ కన్యకాపరమేశ్వరిని ఆదిశక్తి యని వ్యవహరింపఁదగు ననీ పెద్దల యభిప్రాయము. అట్లుఁ గానినాఁడు విశేషజ్ఞు* లామెనుగూర్చిన ప్రశంస నేల వ్రాయుదురు?

ఇట్టి శ్రీ కన్యకాపరమేశ్వరిని ఆదిశక్తి యని వాడక పార్వతీదేవి యని పలికి శ్రీనగరేశ్వరుని భార్య అని పలికి కళ్యాణకథ తంతు చొప్పింపఁబడుచున్నది.

ఈ సందర్భమున నేను జదివిన యొక కన్యాకాపురా ణపుఁ బ్రతిలోని కథాంశము నిక్కడ నుదాహరించు చున్నాను. ఆ విషయ మే యూరిలోని దేవ్యాలయములో నేను చూచినానో ఆ మాట చెప్పఁజాలను. గాని చూచిన మాట వాస్తవము. అది పొందికగాఁ గనుపడుచున్నది.

---

* శ్రీ అ. ల. సోమయాజిగారు. శ్రీ రా. బ. తుం. భగవంతము గుప్తగారు.

"ఆర్యవైశ్యులు మహాగిరి ప్రాంతమున తొట్టతొలుత నుండి నప్పుడు లోకమునందలి ధర్మమును సరిచేయుటకొఱకు లోకమునందు జన్మింపఁ బొండని శ్రీ కన్యకాంబ వారి కాజ్ఞాపింపఁగా - వా రామె సన్నిధి వీడఁజాలక దుఃఖింపఁగా ఆ దేవి-

తాను ఆర్యవైశ్యులకొఱకు భారతదేశమునందు శ్రీ వాసవాంబగా జన్మింతు ననియును - శ్రీ శంకరుఁడు నగరేశ్వరుఁడుగాను, శ్రీ పార్వతీదేవి - వింధ్యవాసినిగాను, శ్రీ మహావిష్ణువు - జనార్దనుఁడుగాను శ్రీ మహాలక్ష్మీదేవి కోనకమలగాను బ్రహ్మదేవుఁడు - భాస్కరపంతులుగాను జన్మింతు రనియును చెప్పియున్నట్లొక సంగతి యున్నది.

దీనినిబట్టి కన్యకాంబా నగరేశ్వరుల కళ్యాణము పొసఁగదు. మఱియును - పైని కథ - తనకు బ్రహ్మదేవుని తనమును గల్గించుకొనుటకై భాస్కరుఁ డీ యవతారముల తంతువు నల్లినాఁ డేమో యనియు తోఁచుచున్నది. మిగత దేవత లందఱు అర్చావతారములయిన శిలావిగ్రహస్వరూప ముల నొంది యుండఁగా - భాస్కరపంతులవార్లు మాత్రము రక్తమాంసమయస్వరూపములతోఁ బ్రత్యక్ష మగు టెందు లకో? ఆర్యవైశ్యులనుండి సన్మానములఁ గైకొని వారి పెట్టె లను కొంతవఱకు ఖాళీ చేయుట కేమో?

భాస్కరునిచేతఁ గాఁబోలుఁ బరికల్పితమయిన పురా ణోక్తపద్ధతినుండి యిప్పు డిప్పుడు శ్రీ మదభినవ పండితరాయ- బాలామర - మామిడి వేంకటాచార్య - శ్రీ లక్ష్మీనృసింహ

సోమయాజి - శ్రీ యార్యవైశ్యమహాసభల యుద్యమముల వల్ల విమోచనము గల్గుచున్నది. ఆర్యవైశ్యులు ఇంకను ప్రబోధము నొంది తమయొక్క కష్టనష్టములవల్ల నితరు లెట్లు బాగుపడినది తెలిసికొనవలెను.

మిక్కిలి యద్భుతమునకును - పవిత్రాశయమునకును సంఘాభిమానమునకును- ధర్మవీరత్వమునకును - ఆత్మగౌరవ మునకును ఆదర్శప్రాయమయినది ఈ శ్రీ కన్యకాపరమేశ్వరీ చరిత్రము. అట్లయినప్పుడు దీనికి పురాణ గౌరవ మెందు కుండదు ?

ఈ శ్రీ కన్యకాపురాణమునుగూర్చిన సవిమర్శమయిన యాశయమునకై నరసరావుపేట కన్యకాపరమేశ్వరీదేవ్యా లయ ధర్మకర్తగారయిన శ్రీ మాజేటి. పూర్ణచంద్రరావు గారు పలుసారులు నన్ను హెచ్చరించిరి. దీని కాలనిర్ణయ మునకు విశేష శ్రమ పడ నేల? విష్ణువర్ధన రాజరాజనరేం ద్రుల కాలమే దీని కాలము.

## ఆర్యవైశ్యులకు సాంకేతిక గోత్రములు

ఈ యంశముయొక్క కారణము ఇతఃపూర్వము వ్రాసిన వారెవరికిఁ దోఁచినట్లు వారువ్రాసినారు. కాని- వారి వ్రాఁతలు ఏ ప్రమాణములపై నాధారపడినవో తెల్పఁబడ లేదు. వారి వ్రాయసముల నింకను బరిశీలించినచో వారి వాదములు కేవల మూహాజనితము లని తోఁచును. బహుశః ప్రమాణములు అసాధ్యములు గావచ్చును.

కాఁబట్టి ఆ యూహాలలో సమంజసములయిన వానిపై సాధారపడవచ్చును గదా?

ఆర్యవైశ్యులకు ఋషిగోత్రములు లేవా? ఉన్నవి. ఎట్లందురా? వైశ్యధర్మప్రకాశిక మొదలయిన పుస్తకము లలో నిచ్చిన పట్టీలలో చూడఁగా ఋషిగోత్రములకును సాంకేతికగోత్రములకును శబ్దధర్మములనుబట్టి

భారద్వాజసగోత్రము-బలిష్ట - } గోత్రము. (సాంకేతికము)
బలిసెట్ల - }

బోధాయనసగోత్రము - బుదరకుల - ,,

విశ్వామిత్రిస ,, విక్రమశిష్ట— ,,

మొదలయిన యుదాహరణములవల్ల ఋషిగోత్ర ములు ఆర్యవైశ్యులకు తొల్లియుండినవే కాని యిటీవలఁ గల్పింపఁబడినవి కావనగా నగును. అయినను దీనికి మఱి యొక ప్రతిబంధకము కల్గుచున్నది, ఎట్లందురా? ఈ వ్యాసమునందు 'చాళుక్యరాజుల రాజ్యకాలమునకు ముందు నుండి యీ యార్యవైశ్యులు చాలవఱకు ఆంధ్రదేశములో నున్నారు. వారు జైనులు - చాళుక్యరాజుల ప్రోత్సాహ మున వారు హిందూమతము నవలంబించిరి. వృత్తినిబట్టి వారు వైశ్యులనఁబడిరి.— అని వ్రాసియున్నారుగదా? అందువల్ల - ఋషిగోత్రములయినను ఈ జాతివారు వైశ్యు లనఁబడుటకొఱకై యప్పుడు ప్రసాదింపఁబడియుండునేమో యనెడు సందేహము గల్గవచ్చును. దానికిఁ బ్రత్యుత్తరము-

జైనబౌద్ధమతములు 5000 సం॥ లకు ముందు జన్మించినవి. తత్పూర్వ మవి లేవు.

ఆ మతము లేర్పడనప్పుడు ఈ యార్యవైశ్యు లని పిలుచుకొన్న జాతి వారు హిమవత్పర్వత తత్ప్రాంతములలో నుండిరి. వారు 102 గోత్రములుగా నుండిరి. వారుండినది హిందూదేశముగాన - ఈ దేశమునందలి సనాతనమతమునకుఁ గాక, వారే యితర మతమునకును జెందియుండరు. హిమవత్పర్వత తత్ప్రాంతములు మహర్షులకు నెలవులు - వారిని జ్ఞానోపదేశార్థ మాశ్రయించుటచే వీరికి వారి గోత్రము లేర్పడినవి. ఈ రీతిగా ఆర్యవైశ్యు లజ్ఞాతగోత్రవంతు లనెడి నడి మాయ మగుచున్నది.

ఆర్యవైశ్యుల సాంకేతికగోత్రములు గల్గిన కారణమునుగూర్చి కొందఱు మిత్రులీ దిగువఁ దెలిపిన యభిప్రాయము నొసంగియున్నారు. "భాస్కర భట్టనెడి, బ్రాహ్మణుఁడు వైశ్యదంపతుల సమూహపు అగ్నిప్రవేశము పిమ్మట మిగిలిన బాలనగరులకు తత్పూర్వ ముండిన ఋషిగోత్రములకు బదులుగా సాంకేతికగోత్రము లేర్పాటు చేసి నది బహుశః సదభిప్రాయముతోనే కాని - దురభిప్రాయముతోఁ గా దని తోఁచుచున్నది. 612 గోత్రములవారగు —— 102 గోత్రముల జట్టుతో సంబంధింపని వైశ్యు లగ్ని ప్రవేశమున కియ్యకొనక వేఱుపడి పోయిరి. వారికిని ఋషిగోత్రము లున్నవి. గనుక అగ్నిప్రవేశమయిన కుటుంబములును, కాని కుటుంబములును కేటాయింపు నొందుటకే- ఆ యగ్నిప్రవేశమునొందిన 102 కుటుంబములు కేవలాంధ్ర

దేశీయములై యుండుటచే కొంతవఱకు తెలుఁగు నుడి కారము గలరీతిగా గోత్రములు సాంకేతిక పఱుపఁబడినవి" ఈ యభిప్రాయము సరియై ఉండవచ్చునని తోఁచుచున్నవి. గాని దీనిపయి నెంత వఱకు నాధారపడవచ్చునో తోఁచ లేదు.

ఈ రీతిగా ఆర్యవైశ్యులకు మొదటినుండి ఋషి గోత్రము లుండియున్నను - ఆ విధమును సరకుఁగొనక ఈ యార్య వైశ్యులనఁబడు వారు అజ్ఞాతగోత్రవంతు లనియును ఋషిగోత్రములు గాక - అసంప్రదాయ మగు గోత్రముల వా రనియు - శృంగేరి పీఠమువారు వీరిని న్యూనపఱుపఁ బ్రయత్నించినట్లు చెప్పఁబడినది. అంతేగాక - బహుకాల ముగా వేదకర్మవిచ్ఛిత్తి నొంది యుండుటచే ఆర్యవైశ్యులకు వేదాధికారము తొలఁగినదియు వికారరూపములగు గోత్ర సంజ్ఞ లుండుటవల్ల వీరు శూద్రప్రాయులనియు ఒకదాని కొకటి సంబంధపడునట్లు వ్రాసిరని నివేదికములు గలవు.

పయి వానిలో గోత్రసంజ్ఞలనుగూర్చి "పంచాంగ ములు గాల్చినంత మాత్రమున నక్షత్రములు మాఱవు"

అని నే నభిప్రాయపడి - యా విషయమునుగూర్చి చర్చ సైగొనక - 1928 లో శ్రీ శృంగేరీ పీఠపు శ్రీ శ్రీ శంకరాచార్యులుగారికి-

"తాము వైశ్యులకు సుమారు 500 సం॥ ల క్రింద వేదకర్మవిచ్ఛిత్తి గల్గినది. అట్లు విచ్ఛిత్తి గల్గి చాల కాలము దాఁటిపోయినది. గాన - వారికి పునః వేదాచారగ్రహణా ర్హత కల్గ దని యంటిరి గదా? తాము పేర్కొన్న వేదా

చారవిచ్ఛిత్తి వైశ్యులకుఁ గలిగినప్పటికంటెఁ బురాతనము నుండి తమ యాచార్య పీఠము వర్ణాశ్రమధర్మములను బ్రవర్తింపఁ జేయుటకై నెలకొనియున్నది గదా? వీరికి ఆచారవిచ్ఛిత్తి గల్గుచున్నప్పుడు మీ పీఠమా స్థితిని చూచుచుఁ జక్కపెట్టక యుండనేల? అది న్యాయ మగునా? అది గాక వీరి కాచారము విచ్ఛిత్తి గల్గినది భాస్కరభట్టనెడి ఒక బ్రాహ్మణుని వల్లఁ గదా? ఆతనిపై పీఠము వారెట్టి చర్యఁ గైకొనిరి? లోనయిన ప్రశ్నలను అడుగు లేఖను వ్రాసియున్నాను. అందులకుఁ బ్రత్యుత్తరము ఎట్టిదియు రా లేదు.

ఇప్పటి యార్యవైశ్యులు వైశ్యులు గారనెడి వ్రాఁతయు సరిగా దనుటకు –

ఎన్నో సంవత్సరములుగా పీఠాధిపతులనుండి 'నూట యిబ్బంద్రు నగరమువారయిన వైశ్యులకు' మొదలయిన పద్ధతులతో నొసంగఁబడిన (శ్రీ) ముఖముల ననేకముల నుదాహరించి (శ్రీ). కీ. శే. లక్ష్మీనృసింహ సోమయాజి గారు వాదమును నిరస్తము చేసినారు.

ఈ రీతిగా వైశ్యులయొక్క వేదాధికారము పురాతనమయిన దని తెలియుచున్నను–

ఇఁకను (శ్రీ) కన్యకాపరమేశ్వరీ దేవస్థానములలో బ్రాహ్మణార్చకు లుండుట మనకు బలహీనతాకరముగదా? మన యాఁడుబిడ్డ యని మనము సప్రేమముగాఁ జెప్పుకొను దేవతను మనమే ఏల యర్చింపరాదు. అట్టి వైశ్యార్చకుఁ

డగు సోదరునిచేత మనము తీర్థప్రసాదములను గైకొన రాదా? చాల స్థలముల యందు బ్రాహ్మణార్చకులు దేవతను "శ్రీ కన్యకాపరమేశ్వరి" యనక "శ్రీ రాజరాజేశ్వరి" యని యాహ్వానించి పూజించుటయో,

ఒక వేళ శ్రీకన్యకాపరమేశ్వరి యని చెప్పవలసి వచ్చినచోట ఆ పూజ తీర్థప్రసాదములను తాముమాత్రము గైకొనక అక్కడకు వచ్చిన వైశ్యులకు పంచిపెట్టుటయో జరుగుచున్నది. అయినను వచ్చిన దక్షిణల డబ్బులను వస్త్రములను మడి మాన్యములను జీతములను ఆ బ్రాహ్మణులనుభవించుటకు వెనుదీయరు-

ఇఁకను "భాస్కరపంతులు" అనునది ఆర్యవైశ్యుల పాలిటి కొక పీఠ మయిపోయినది. వారు వైశ్యులకు గురువులని చెప్పఁబడుచున్నది. ఏ తరమువారకి-ఎవరు ఏమి నేర్పిరో వారు ఆ తరము వారివల్ల తాము కోరిన రీతిని ఆ శిష్యుల నుండి గురుదక్షిణ తీసికొని తప్పక తరింపఁ జేసి యుందురు. ఆ పరాక్రమమున వారికి లోటుండదు గదా? ఆ భాస్కర పంతులుగారి తరము వారే యీ భాస్కరపంతులుగార్లనుటకు కొన్ని యూళ్ళ వారు స్మార్తులు మాధ్వులు ఈ రీతిగా ఇచ్చి పుచ్చుకోళ్లు వీలులేని భిన్నత గల్గియున్నారు. గనుక-

"దీని భావ మేమి తిరుమలేశ!"

అనెడి పద్యపాదము ప్రత్యక్షము. ఈ వ్యాసము అనంతముగాఁ బెరుఁగగలదు. మిగత సంగతు లూహ్యములు.

దొరకిన సామగ్రితోఁ బ్రబంధము వ్రాసియున్నాను. అది పద్యకావ్యము-చర్చ వచనము-నా వ్రాతయే నిష్కర్ష యనెడి భావము గాని యహంకారము గాని నా కనవసరము

కాని- "త నంత శ్రోతు మర్హంతి
సదస ద్వ్యక్తి హేతవః"

అనెడి రీతిని దీనిని గుర్తించిన వారు వలయు మార్పులు చేర్పులు గావింతురుగాత. ఇయ్యది గాలి గోపురము శిఖరము గాక పోయినను-పడికట్టుగానయిన గానగునేమో? అని విన్నవించి ఆర్య వైశ్యసోదరులకు అభిజ్ఞులకు నమస్కరించుచున్నాను.

ఈ యంశమునుగూర్చి మఱి కొన్ని విషయములు గూడ తెలియ వచ్చినవి. "ఆర్యవైశ్యు లనఁబడు 102 గోత్రములు బహుశః మంగోలుజాతికి సంబంధించిన వారగుదురు. వీరు హిమవత్పర్వతములలో "మహాగిరి" యనెడి యొకానొక శిఖరపుఁ బ్రాంతమునందుఁ బాశుపాల్యవృత్తితో నుండిరి. అప్పటి వారి భాషలో ఆ మహాగిరికి "పతకోయ" శబ్దము "పెద్ద కొండ" వర్ణలోప - వర్ణవ్యత్యయ - వర్ణాదేశ-వర్ణాగమాది తద్భవపద్ధతి ప్రకారము అయి యుండ వచ్చును. అందు "పత" పెద్ద "కోయ"-కొండఅయి యుండవచ్చును. "పత" కు "పెద్ద" కు శబ్దసామ్యము కొంతవఱకు నున్నది "కోయ" అనెడి శబ్దమునకు ఇప్పుడుఁగూడ కొండమనుష్యుఁ డనెడి అర్థముకలదు.

ఆదిశక్తి భక్తులయిన వైశ్యులలో శ్రేష్ఠుఁడయిన శంభుశ్రేష్ఠి యను నతనికి ఆదిశక్తి తన యంశమునఁ గొమార్త

డై జన్మించి యత్యంతరూపలావణ్యములతోఁ బ్రకాశింపు చుండగా - (శ్రీ) శివదర్శనార్థ మరుగుచున్న తత్సమీపమునందలి మణిపురపురాధీశ్వరుఁడయిన చిత్రకంఠుఁ డనెడి గంధర్వుఁ డాకన్యకారత్నమును మోహించి - యామెను దనకు భార్యగానీయవలసిన దని యామె తండ్రి యగు శంభు శ్రేష్ఠి మొదలయిన వైశ్యులను గోరెను. వా రామె భగవత్యంశసంభూతురా లగుటచే నతనికి నొసంగ వీలు గాదనిరి. అందుల కా గంధర్వరాజన్యుఁడు కోపించి "యో వైశ్యులారా! మీ కన్యకనుగూర్చి యే రీతిగా నేను మోహాగ్నియందు సంతప్తుఁడ నగుచున్నానో యా రీతిగా మీ రందఱును ఆకన్యకతోఁ భూమియందు జన్మించి యగ్నికుండమునందు దగ్ధు లగుదురుగాత యని శపించె. అందులకు వైశ్యులు కుపితులై జన్మించి యాకన్యకయందలి మోహమును జేసియే యత్యాచారము నొనర్పఁ బ్రయత్నించి - విఫల ప్రయత్నుండ వై - తల వేయి వ్రక్క లై నశించును. అట్లు పరమేశ్వర్యంశయగు ఈ కన్యకాదేవితోఁ గుండప్రవేశ మయిన 102 గోత్రముల వైశ్యులు అట్లుఁ గుండప్రవేశము కాని 612 గోత్రముల వైశ్యులనుండి భిన్ను లని తెలియబడుటకై సాంకేతికగోత్రనామములను వహించి వేదాధికారములు గల్గి - మధు మాంసభక్షణములు లేక ప్రకాశింతురని యా శంభుశ్రేష్ఠ్యాదులు పరమేశ్వర్యభిప్రాయము ప్రకారము వ్రాక్రుచ్చినట్లు ఒక విమర్శకుండు పరిశీలించి వ్రాసియున్నాఁడు.

పైని యంశములకుఁ బొందునట్లుగా పతకోయ (హిమాలయ – మహాగిరిశిఖరము) కడ నుండిన వైశ్యులకును మణిపురమునందుండు (అక్కడివారు ఇప్పటికిని చాల అందమయిన వారఁట – అందులకే కాంబోలు గంధర్వు లనఁబడినవారు) వారికిని అప్పుడప్పుడు యుద్ధములు పొసఁగుచుండుట వల్లను మఱి కొన్ని యితర కారణములవల్లను మహాగిరిప్రాంతమున నుండు వైశ్యులు క్రమముగా దక్షిణమున నుండు గౌరు దేశముద్వారా గంగా బ్రహ్మపుత్రముఖద్వారప్రదేశములను బ్రవేశించి – యక్కడి జనులయొత్తిడిచేతనో మఱేకారణముననో నైరృతిదిశగా వచ్చి యాంధ్రదేశమునందలి పెనుగొండగల ప్రదేశము గల గోదావరీతీరమునందును – అనంతపురము జిల్లాయందలి "పెనుగొండ" గల ప్రదేశమునందును – మైసూరు "దొడ్డబెట్ట" గల ప్రదేశమునందును నెలకొనిరి. అంతకు ముందె ట్లున్నను ఈ స్థలములలో నెలకొనునప్పటికి వీరు అప్పటికి దేశమునందు మిక్కిలి బలవంతముగా వ్యాపించియున్న జైనమతము నవలంబించిన ట్లున్నది. గోదావరీతీరమునందలి వారు క్రమముగా తమ పాశుపాల్యమునువదలి–సముద్రమునకు సమీపమున నుండుటవల్లఁ గాఁబోలు ఓడబేరము మొదలయినవర్తకములలో విశేషముగాఁ బ్రవేశించిరి. వీరును అనంతపురము జిల్లాలోని వారును తదుపరి చాళుక్యరాజుల కాలమున వేదమతావలంబులై వృత్తినిబట్టి వైశ్యు లనఁబడిన ట్లూహింపఁబడుచున్నది. అది సరియనియే తోఁచుచున్నది. "దొడ్డబెట్ట" సమీపమునందలి వారనేకులు

ఇప్పటికిని జైనులుగానే యున్నట్లు తోఁచుచున్నది. ఇట్లే యెన్నో విషయములు పరస్పర విరుద్ధాభాసములుగా తలఁచు కొలఁదిని తోఁచుచుండును. ముఖ్యాంశము లేమో తేఁట తెల్ల మయినట్లే కదా?

ఇందలి సంగతులలో నేదియు నా సొంతపు టూహాల పయిన నాధారపడ లేదన వచ్చును. ఇందులకు ఆధారములు—

శ్రీ వాసవి పత్రికా సంచికలు 1926వ సం॥ నుండి దర్శిలావి.

కీ॥ శే॥ శ్రీ వేంకటసుబ్బరాయశర్మ గ్రంథిగారి వ్యాస ములును గ్రంథములును.

శ్రీ రా। బ। తుంపూడి భగవంతము గుప్తగారి వ్యాసములు.

ఆర్యవైశ్య మహాసభలయందలి యుపన్యాసములును.

శ్రీ శృంగేరిమఠము వారి ప్రచురణ, శ్రీ భారతీయ వైశ్య పత్రికా ప్రచురణములును శ్రీ దక్కన్ వైశ్య ప్రచు రణములు అయియున్నవి. వానిని తిలకించినచో నా వ్రాయు నది యథార్థ మని తెలియఁగలదు.

'కన్యకాంబ – వాసవాంబ – సోదరుఁడు విరూపా క్షుఁడు –, వాసవాంబ - శచీదేవి.

శతజిహ్వునితో జయంతుఁడు యుద్ధము చేయవలయు నని బ్రహ్మకోరఁగా – శచీదేవి యడ్డగించినందున వైశ్యస్త్రీ యగునట్లు బ్రహ్మచే శపింపఁబడినది. ఇంద్రుని ప్రార్థనచే ఆమె భూలోకమున నెవ్వనిని వరింపక కన్యగా మరణించినది.

మఱియొక కారణము సోమకాంతుఁడను యతీశుని భార్య సుశీల శచీదేవిని తనకుఁ గోమార్తగా జన్మింపవలె నని ప్రార్థింపఁగా – ఆ సుశీల భూలోకమునందు కుసుమాంబ గాను, శచీదేవి యామె పుత్త్రి యగు వాసవిగాను, (భర్త సోమకాంతుఁడు – కుసుమశ్రేష్ఠిగాను) జన్మించినారు.

(పూర్వగాథాలహరి - 188 - 89)

ఈ పూర్వగాథాలహరిలోఁ గల పైని యంశము ఏ పురాణములోనిదో తెల్పబడినట్లు లేదు.

మఱియును= "ఓం కాత్యాయనాయ విద్మహే! కన్యకుమారి ధీమహి। తన్నో దుర్గిః ప్రచోదయాత్। (నారాయణమ్)" అనెడి నారాయణీయములోని మంత్ర మును శ్రీ కన్యకాపరమేశ్వరి యొక్క ప్రముఖదైవతమని తెల్పఁ దోడ్పడును గదా?

శ్రీ కన్యకాపరమేశ్వరి ఆదిశక్తియు ననెడు ప్రశ్నను గొందఱు స్నేహితు లడిగియున్నారు. అందులకు నుత్తరము.

శ్రీమద్భాగవతము దశమస్కంధ పూర్వభాగము నందలి యోగమాయా ఘట్టములో శ్రీ కృష్ణుని సంభాష ణమునందు ఆదిశక్తి స్వరూపములలో కన్యక యొకటి యని కలదు. శ్రీ కన్యాకుమారీ క్షేత్రము - భారతదేశమునందలి దక్షిణతమ మహాస్థలము - దేవతకు యంత్రాది లక్షణము లున్నవి. పెనుగొండలో వైశ్యుల కులదేవత యయిన యీ కన్యక అచ్చట (కన్యాకుమారియందు) సార్వజనీన దేవత అయినది.

శ్రీ మద్భాగవతము - (శ్రీపోతరాజకృతము) దశమ స్కం: పూర్వభాగములో శ్రీ కృష్ణయోగమాయా సంభాషణ ఘట్టమున = 61 వ సంఖ్య - వచనములో శ్రీ యోగమాయకు - 1. దుర్గ, 2. భద్రకాళి, 3. విజయ, 4. వైష్ణవి 5. కుముద, 6. చంద్రిక, 7. కృష్ణ, 8. మాధవి, 9. కన్య 10. మాయ, 11. నారాయణి, 12. ఈశాని, 13. శారద, 14. అంబిక యనెడి 14 రూపము లున్నట్లు చెప్పఁబడినది. ఇంకను ఇతర ప్రమాణము లున్నట్లును - ఇందును శ్రీ కన్యకాస్వరూపము దేవతయొక్క ప్రశాంత తత్త్వయుక్తములోఁ జేరిన దనియు తెలియుచున్నది.

ప్రకృతము లభించిన యంశముల నిందు సంగ్రహించి మనవి చేసినాను-

ఇంక నేమి లభించునో యేమి వ్రాయఁగలమో యది భగవదేకవేద్యము గదా?

భూలోకమును ప్రవేశించిన వైశ్యులు వసించిన 18 పురముల పేర్లు.

1. జ్యేష్ఠశైలము (గోదావరీ తీరమునందలి పెనుగొండ 2. నిరవద్యకము, 3. ఏలాపురము (ఏలూరు), 4. వీరనారాయణము, 5. విశాలము (విశాఖపట్టణము), 6. శివపురము, 7. ఆసంటము, 8. నరసము (నరసాపురము), 9. ధనదము, 10. ధర్మపురము, 11. జగన్నాథము, 12. కళింగకము, 13. పాంచాలము, 14. పాల్కుండము, 15. త్రిగుణము, 16. భీమము, 17. ఘంటసాలము. 18. పీఠికాపురము—

☞ శ్రీరావుబహదూరు తుం. భగవంతముగుప్తగారితో

నిటీవలఁ గల్గిన సంభాషణావకాశములో వారు కొన్ని విశేషములు చెప్పినారు. అందుమూలమున మనము ఇతః పూర్వము తెల్పిన సంగతులకు అట్టే బాధ కల్గునట్లు లేదు. బర్మాకు ఇండియాకు మధ్యలో అస్సాంకు చెందిన "పాట్కాయ్ హిల్స్" అనెడి కొండ లున్నవి. అందు నుండు పార్వతీయ జాతులలో నొక జాతివారు కాట్సిూ లనఁబడుదురు. ఈ కోయ జాతు లనేకస్థలముల అనేకములయిన = కొండులు - సవరలు-" మొదలయిన యనేక నామములు గల్గి యున్నారు. ఆ కాట్సిూల దేవతకు కోమతేశ్వరి యని పేరు గలదు. గోమతేశ్వరి యను దేవత విగ్రహమును మహాభారత యుద్ధములో భగదత్తుఁడు (నరకాసురుని కొమరుఁడు) తన కుడి భుజమున ధరించుచుండినట్లు చెప్పఁబడియున్నది. పాట్కాయ కొండలకు మణిపురము సమీపము. ఇప్పుడు శ్రీ కన్యకా పురాణములోని చిత్రకంఠుఁ డను గంధర్వుఁడు మణిపురాధీశుఁడు. "పాట్కాయ" శబ్దము "పత కోయ" యై దాని తద్భవభావ మర్యాదలతో పెద్దకొండ యయినది. ఇప్పు డా పాట్కాయ కొండల పయిన నుండు కాట్సిూలు పూర్వ మక్కడ నుండిన వారి యవశిష్టమై యుండవచ్చును. గోమత శబ్ద భవములు కోమటి కోట్సి కావచ్చును. ఆ కొండలలోనుండిన జాతులకు సహజపరిస్థితిగా గోసంరక్షణము వృత్తిగా నుండును

గనుక 'గవాం మత మస్యా స్త్రీతి గోమతీతి' అను వ్యుత్పత్తి ప్రకారముగా కోమటి శబ్ద మేర్పడును. ఆ కోమటి పద మార్యవైశ్య శబ్దపర్యాయ మయినది. దాని కిట్టి తగు వ్యుత్పత్తి యున్నది గాని లేకపోలేదు గదా? అందువల్ల కోమటి శబ్దము పరిహాసార్థముగా జాతీతరులు వాడ పని లేదు. తజ్జాతీయులు వివరము తెలియక ఆ పదమును వాడ పనిలేదు. అయినను కోమటి శబ్దము కొంచెము శ్రుతి కటువుగా నున్నది. అది యటులుండ నిండు. పాట్కొయ కొండల తాలూకు "పాట్కొయ" "పతకోయ" యైన ట్లున్నది లేక దేశీయములో "పతకాయ"గా నుండి యింగ్లీషు వారి యుచ్చారణలో "పాట్కొయ" యయియుండవచ్చును "పత" పెద్ద యగుట సులభము. "కోయ" యనంగా కొండ యర్థము సిద్ధము. పెద్ద కొండ పెనుగొండ. 'పత కాయ' శబ్దము జ్ఞాపకార్థముగా - అక్కడినుండి వ్యాపించిన వైశ్యులు తమ పట్టణమునకు - అక్కడ కొండ లేక పోయినను 'పెనుగొండ' యను పేరుపెట్టినారు. ఇట్లు 'కోమటి' 'పెనుగొండ' శబ్దముల కొక నిష్పత్తి యూహింపఁబడినది. ఇఁక ఋషి గోత్రములు సాంకేతిక గోత్రములు పట్టీలుగా తయారు చేసినాము. అవి యీ పుస్తకములో చేర్చినాము. అవి సేకరించుటకు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి గారి వైశ్య ధర్మ ప్రకాశికాది గ్రంథములు కొన్నియును

తోడుపడినవి. అట్టి సాహాయ్యమునకు కారకులయిన వారికి మా కృతజ్ఞతా నమస్కారములు.

శ్రీభగవంతం గుప్తగారి యభిప్రాయము లన్నియు పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథములపై నాధారపడియున్నవి. అనగా హిందూదేశపు చరిత్ర—

ఇయ్యవి పక్షపాతబుద్ధితో వ్రాయబడినవని భారతీయ చరిత్రకారులు పరిశోధకులు, గనుక ఈనాడు తెలుపు చున్నారు.

శ్రీగుప్తగారి యభిప్రాయములు విశేషముగా పరిశీలింపబడవలసియున్నవి.

విష్ణువర్ధనుని మరణానంతరము కలిగిన విపత్కర పరిస్థితులలోగూడ, తమ వైదికాచార పద్ధతిని విడనాడని కుటుంబము లనేకములున్నవని, కీ॥ శే॥ బ్రహ్మర్షి తూనుగుంట్ల రామస్వామిశ్రేష్ఠిగారు చాల పరిశోధించి చెప్పి యున్నారు. అట్టి కుటుంబములు - గుంటూరు - జమిలి - తూనుగుంట్ల - సంకా - బొలిసెట్టి - మామిడి - ఆకుర్తి మొదలగు ఇంటిపేరులు గలవారు.

కారణాంతరములచే గోత్రముల పట్టీ ఈయబడలేదు.

—ప్రకాశకులు.



# గ్రంథకర్త కుటుంబము







ఎడమవైపు - క్రిందిభాగము - పుత్రుడు ఆంజనేయగుప్తగారు

B.A., B Com, C.A I.I.B., F R E S.

ఎడమవైపు - పైభాగము - ధర్మపత్ని వెంకటసుబ్బమ్మగారు

కుడివైపు — పుత్రిక భాషాప్రవీణ గోళ్ల ఇందిరాదేవిగారు. నవగుప్తగృహం, రాజమండ్రి

# ద్రవ్యదాతలు



శ్రీ దిగుమతి నేతికోట్ల సంఘ భవనము - గుంటూరు

మేనేజర్లు : శ్రీ గొటపర్తి ముక్తేశ్వరరావు
శ్రీ మారేమల్ల హనుమంతరావు

---

## ద్రవ్యదాతలు—మరికొందరు

1. శ్రీ ఉప్పల పంచు సూర్యనారాయణ - వ్యాంకర్లు - రైలుపేట - గుంటూరు
2. శ్రీ శ్రీకాశీవిశ్వేశ్వర టుబాకో కంపెనీ పొగాకువర్తకులు - గుంటూరు
3. శ్రీ ధూళిపాళ్ళ వెంకటరత్నం - బ్యాంకర్లు - గుంటూరు
4. శ్రీ దొమ్మిరాల పూర్ణయ్య అండ్ బ్రదర్స్ - పొగాకువర్తకులు - గుంటూరు
5. శ్రీ [illegible] కుమారస్వామి - బ్యాంకర్లు - సికింద్రాబాద్
6. శ్రీ వేగు కృష్ణమూర్తి - పొగాకువర్తకులు - గుంటూరు
7. శ్రీ కవిపాదుషా కొప్పరాపూరి సత్యనారాయణ - బట్టలవర్తకులు - విజయవాడ
8. కీ॥ శే॥ దొండా వెంకటేశ్వర్లుగారు - భూస్వాములు - కొండంగి (కృష్ణాజిల్లా)

# ద్రవ్యదాతలు



శ్రీ కొత్తూరు రామయ్య గారు
వర్తకులు - క్రొత్తపేట - గుంటూరు



శ్రీ మాడిశెట్టి బ్రహ్మయ్య గారు
వర్తకులు - అగ్రహారము - గుంటూరు



శ్రీ మాజేటి వెంకటరామకోటిముత్యాలు
వర్తకులు - బ్రాడీపేట - గుంటూరు



కీ॥ శే॥ చక్కా పిచ్చయ్య గారు
వర్తకులు - గుంటూరు

# ద్రవ్యదాతలు



శ్రీ వనమా వెంకటరత్నం గారు
వర్తకులు - అగ్రహారము - గుంటూరు



ది॥ శే॥ మంచికొండ గౌరీశంకర్ గారు
పొగాకు వర్తకులు - గుంటూరు



శ్రీ కూరాళ్ల మాధవరావు గారు.
వర్తకులు - గుడివాడ



శ్రీ చీదెళ్ల వీరయ్యగారి దత్తకుమారుడు
వెంకటేశ్వర్లుగారు - గుంటూరు

# ద్రవ్యదాతలు



శ్రీ దానశీల
కాకరపర్తి భావనారాయణశ్రేష్ఠి గారు
బ్యాంకర్లు - విజయవాడ



కీ. శే. పోలిశెట్టి సోమసుందరం గారు
పొగాకు వర్తకము - గుంటూరు



శ్రీ పైండా వెంకటరత్నం గారు
ఆడిటర్లు - ఏలూరు



శ్రీ నూలి వెంకట సుబ్రహ్మణ్యం గా॰
బ్యాంకర్లు - పెనుగొండ

నిలిచియున్నవారు ఎడమనుండి :

1. జమిలి నమ్మాళ్వారు
2. గుంటూరు నరసింహరావు
3. రేకపల్లి భాస్కరరావు
4. పోలిసెట్టి ఆదినారాయణ గుప్త
5. ఉప్పుటూరి వీరరాఘవయ్య
6. ఉప్పుటూరి వెంకట పున్నయ్య
7. మద్ది సుదర్శనము
8. మాజేటి బాపయ్య

తిన్నపై కూర్చొన్నవారు :

1. గ్రంధి సుబ్బరాయశర్మ (గుప్త)
2. గ్రంథకర్త దో॥వెం॥సా॥గుప్త
3. ఆకుల వెంకటరత్నము



గుంటూరులో గ్రంథ



భక్త మిత్రబృందముతో (1921)

# ద్రవ్యదాతలు



శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావు గారు
యం. ఎల్. సి. - పిప్పర



శ్రీ తడికమళ్ల వీరభద్ర అప్పల
చినరాజన్న గారు - లక్కవరం



శ్రీ మోతె అంజరత్న రాజకుమార్ గారు
జమీందార్లు - ఏలూరు



శ్రీ ఆచార్య కొత్తమాసు
వెంకట సుబ్బారావు గారు - గుంటూరు



శ్రీ కొప్పు రావూరి కోటేశ్వరరావు గారు
వర్తకులు - గుంటూరు



శ్రీ గోపవరపు వీరయ్య గారు
వర్తకులు - గుంటూరు



శ్రీ. శే. పత్రిపాటి వెంకటరత్నం గారు
పొగాకు వర్తకులు - గుంటూరు



శ్రీ కన్యకాపరమేశ్వరీదేవి
నెల్లూరు

# ద్రవ్యదాతలు



శ్రీ గొల్లపూడి రాధాకృష్ణయ్య గారు
భూస్వాములు - వేటపాలెం



శ్రీ॥ శ్రీ॥ కొలిశెట్టి గోపాలరావు గారు
వర్తకులు - గుంటూరు



శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి గారు
భూస్వాములు - పిప్పర



శ్రీ మనికొండ కాశీవిశ్వనాథం గారు
వర్తకులు - విజయవాడ



శ్రీ గంధవడి శ్రీరాములుశెట్టి గారు
నగల వర్తకము - మద్రాసు



శ్రీ బూలూరి వీరేశలింగంగారు
బట్టల వర్తకము - సికింద్రాబాదు



. శ్రీ. సింగంశెట్టి యతీంద్రుడుశెట్టి గారు
[చారిటీసు] మద్రాసు



శ్రీ తుమ్మలపల్లి శివవీరభద్రరావు గారు
ధాన్యములు - ఏప్పూరు

ద్రవ్యదాతలు



శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానం, సత్రం కమిటి (తెః

(1963-64 సం॥రం పాలకవర్గపు సభ్యులు)

మొదటి వరుస :—(కూర్చున్నవారు - ఎడమనుండి కుడికి)

1. శ్రీ నటుకుల గురవయ్య, 2. శ్రీ గొడవర్తి చెంచయ్య (Asst. Secretar
3. శ్రీ కొత్తమాసు రామకోటీశ్వరరావు (Secretary), 4. శ్రీ చెన్నుర
కోటయ్య (President), 5. శ్రీ తాడిపర్తి కుటుంబరావు (Vice Presiden
6. శ్రీ కొల్లూరు కోటయ్య (Treasurer), 7. శ్రీ పద్మనాభుని చెంచయ్య.

రెండవ వరుస :—(నిలుచున్నవారు - ఎడమనుండి కుడికి)

1. శ్రీ కోట శ్రీమన్నారాయణ, 2. శ్రీ వుప్పల కాశీవిశ్వనాథం, 3. శ్రీ ఘంటిమం
ఉమామహేశ్వరరావు, 4. శ్రీ కొత్తమాసు మోహనరావు, 5. శ్రీ మట్టుప
వీరసుబ్రహ్మణ్యం, 6. శ్రీ కూరపాటి వేంకట్రావు, 7. శ్రీ వేమూరి వెంః
సుబ్బారావు, 8. శ్రీ కోళ్ళపూడి జ్వాలారావు.

# ప్రచురణ నిర్వాహకులు



పండిత శ్రీ జమిలి నమ్మాళ్వారు
రామచంద్రపుర అగ్రహారము - గుంటూరు 3

సంపాదకుడు
గుంటూరు పత్రిక - వాసవి పత్రిక
నమ్మాళ్వార్స్ ప్రచురణలు

కర్త
శ్రీ కన్యకా సుప్రభాతమ్ - శ్రీరామగీత
గాంధిమహోపదేశమ్ - మరికొన్ని



కవికేసరి అద్దేపల్లి సత్యనారాయణ *
మంటపల్లి (కృష్ణా)

సంపాదకుడు
కాపు పత్రిక, సుజనరంజని
గ్రంథమాల

కర్త
బ్రాహ్మణ వేదోక్త క్రియావిచార
వ్యవస్థా-రామాయణమంటే?-మరికొన్ని

---

* వీరు 11-2-68 దివంగతులైరి.

# ఆకాంక్ష

దోమా వేంకటసామి గుప్త కవిరా ద్ధుర్యావధానక్రియా
శ్రీమంతుండు, సఖుండు, పండితకుల శ్రేష్ఠుండు; భాషావధూ
టీ మాన్యుండు, పణి క్కులాభరణుడున్, తీవిం రచింపంగ నౌ
శ్రీ మాన్యంబగు కన్యకాచరిత మర్పింపంగ భాగ్యంబె కా!

ఆంధ్రాఖండ బుధప్రకాండ నుత విద్యానాథుఁడై "నవ్యనీ
రంధ్ర స్వర్గధునీ తృణీకరణ ధారాబద్ధ" సత్కావ్యుఁడై
ఆంధ్ర ద్రావిడ సంస్కృతాంగ్ల రస ధుర్య ప్రాభవోపేతుఁడై
ఆంధ్రం బందు విరాజిలెన్ శత వధా నాబ్ధీందుఁడై మిన్నగాన్"

వాసవి సచ్చరిత్రపు ప్రబంధము - పూతకథా నిధానమున్
శ్రీసముపేతమైన కులశేఖరమండలి సాయ మీయగా
జేసితి ముద్రణంబు - యిది చేసిన వారికి వారివారికిన్
వాసవి సత్కృపా రస మపారము కల్గుత మెల్లకాలమున్

'బాలరసాలసాల నవ పల్లవ కోమల కావ్యమిద్ది - భా
షాలలితాంగికిన్ తగు ప్రశస్త తరాభరణంబు - సాహితీ
లాలిత మానసంబుల బలంబు - రసామృత కల్పకంబు - యే
వేళ పఠించువారికి నభిన్న సుఖ ప్రదమై చెలంగెడున్:

గుంటూరు
కీలక - చైత్ర
శుద్ధ ౧ శుక్రవారము
౨౯-౩.౬౮

శ్రీ కన్యా పరమేశ్వరీమణికి వే చేతు న్న మోవాకముల్
వీకన్ సర్వజగన్నికాయ భరణావేల ప్రభావప్రభా
సాకారాత్మ నిరాకృతాత్మ చరితవ్యాహార నీ హార ధా
రాకూలంకషకున్ సమస్త శుభ సంప్రాప్త్యర్థమై నిచ్చలున్

నిరతంబున్ మదియందునుం బయట నెంతేబొల్చి భక్తాళికే
తెఱఁగైనట్టి సిలుంగురానటు సుఖాప్తి శ్రేణియొప్ప-న్నిరం
తరముం గంటికి ఱెప్పయట్లైసఁగు సీతానాయకుణ్ సర్వశం
బర రుడ్డాండమయు న్నిరామయుని రామస్వామినిం గొల్చెదన్

ఇలువేల్పై యెప్పుడు మం
గళ కరుణాపాంగ భంగికమ్ముగ మమ్మున్
సిలుఁగు లడఁచియు మనుచు శ్రీ
లలనాధిపు వేంకటేశు లలిని భజింతున్

అందని ప్రానిపండ వయి యందము జందముఁ జూపుచున్ సదా
డెందములం గలంచెదు కడిందిగ మా దృశ భక్తపాళి-నో
యిందిరరో! విరక్తి సుఖ మేనియుఁ గొల్పినచో నొకళ్ళ దా
మందిర మేఁగు పాటుఁగను మాదిరి గాంచెదరే కవీశ్వరుల్

తల్లీ నీదు పదారవిందముల నాత్మం బూని-నీ వీయ నౌ
ప్రోల్లాసం బెటు ద్రోచునమ్మ యిఁ గృతుల్ పొల్పొందగా జల్పుభా
స్వల్లీలాభరులౌ కవీశ్వరుల కీ ప్రాపంచికా ర్తిచ్ఛటా
దు ల్లేకుండ వరమ్ము లిమ్మనుచు నెంతు న్నిన్ను వాగ్దేవిరో

ప్రళయాగ్నిచేఁగన్ను ప్రజ్వరిల్లియు శ్రితు
లను జల్లనౌ చూడ్కిఁ గనెడివాఁడు
గళము హాలాహలాకరమయ్యు నార్తిహ
రములౌ వరములీఁ జెలంగువాఁడు
ఘోరాహి రాజన్య కుండలుండయ్యు-నా
కల్పాయువు నొసంగి కాచువాఁడు
బూది పూఁతంబూసి-పునుకలం దాల్చియు
సకల సంపదలీయఁ జాలువాఁడు.

అతుల వైరాగ్య యుతుఁడయ్యు-నర్ధతనువు
నందు సుందరిం దాల్చిన యట్టి వాఁడు
బూచు లెకిమీఁడు మేటి దోబూచు లాఁడు
అయిన చంద్రశేఖరుఁడు మ మ్మరయు సతము

కామునకుం బునర్జనిని గల్గఁగఁ జేసిన పేర్మిప్రోవు-ప్రో
ద్దామ దయావిశేషమునఁ దద్దయు నైహిక పారమార్థిక
శ్రీమహితత్వముల్ శ్రితులఁ జెందఁగఁ జేయు లసచ్చరిత్ర-ఆ
ఘామి ధరాత్మజాత మముఁ బొల్పుగ నేలు ననల్పసత్కృపన్ 2

గజాననున్ షడాననున్ జగన్నుత ప్రకారులన్
భజించెదన్ శివాజవం జవప్రభాకరిష్ణులన్
అజేయులన్ వృషాధిరా ణ్మృగాధిరా ట్ఖగేంద్రులన్
విజయ్యు మేట్కుటుంబ వాహబృందమున్ సదాముదిన్.

శ్రీమద్రాఘవ నామ సంస్మరణ మర్థిం బొల్చుచో సాంజలిన్
ప్రేమం బొప్పఁగఁ జేరి భక్తులను నేవేళన్ గడున్ దోడు నీ
దై మవ్వంబుగ నెల్లసౌఖ్యములు వారందం దయం బ్రోచు ను
ద్దామజ్ఞాననిధానముం దలఁతు నాత్మన్ వాయుపుత్త్రాగ్రణిన్

శ్రీ సాయిబాబ నెంతున్
భాసుర కరుణా రస ప్రభావునిఁకన్ సం
తోసమ్ముగ శ్రీరమణున్
దాసావను నెంతు మౌని తతి రత్నంబున్

అమరేశ్వరు నాలయ మం
దమరిన యమృతమ్ముఁ దేర నరగి విజయవ
తమెయిన్ వచ్చిన సద్వి
క్రము విష్ణురథాత్ము నెంతు గరటామంతున్

తిరుపతి వేంకటేశ కవి ధీరుల మానస మందు గొల్చి-యే
త్తెర గదవాల కృష్ణుని సుధీమణిభూషణు నింద్రకంటి భా
సుర కుల సుబ్బయార్యుఁ గవిసోముని విశ్వపు నింక నెంద తెం
దతి నొకొ కైతకై కొలిచి నాడను వారికి దార్తు నంజలుల్ ౧౨

ఆంధ్ర గీర్వాణ వాగబ్ధులందు రత్న
కాంతులం గన్న సుకవుల గణన సేయఁ
బూను కన్న వారికి వారి-పుణ్య శీల
ములకు సాష్టాంగవందనంబుల నొనర్తు

పది యేండ్లప్పటి నుండియుం దహతహల్ స్వాంతంబును గైతకై
యొదవన్ వైశ్యుల పట్టి నోట సిరి నెంతో కూర్చు పీఠ్లుండియున్
ముదముం గైతకె పూన సమ్మదము సంపూర్ణంబుగానొందు నెం
పుదయం గొల్పిన సద్రసజ్ఞుల కివే మ్రొక్కుల్ సమర్పించెదన్

నూటిబ్బంద్రగు గోత్రసంఖ్యఁ దగుచున్ భూమండలిం బొల్చుకై
రాటోదార కులానఁ బుట్టుటను నర్యశ్రేణి యద్దానకున్
బాటిన్ సర్వశుభమ్ము లిచ్చు కులదైవశ్రేష్ఠమౌ తల్లి నె
చ్చోటన్ వాసవకన్యకం గొలువఁగా జొప్పొందు మత్కృత్యమై

అల కన్యాపరమేశ్వరీ శుభ కథా వ్యాహార మందందు రీ
తుల నెన్నింటినొ చెంది యుండనవి యేదో చేతనై నంత నే
నెలమిం జూచియు నీప్రబంధమును నిర్మింపం దగెన్ వైశ్యమం
డలికిన్ మండనమై మహోఘచయ వన్యాఖండనంబై తగన్

స్కాంద పురాణ మందుఁ గల గాధ యిదంచును జిత్పురీవరం
బందును[చిత్తూరు]ముద్రితంబయినయట్టి కృతింగల దద్దికాంచగా
స్కాందపురాణపుం బ్రతినొకండును గాంచఁగ గానరాదు—తా
మెందునఁ బాఠభేదమెది యెమ్మెయి గాంచిరొ చిత్పురీబుధుల్ ౧౭

ధారనుబట్టి చూడ సముదారముగాఁ గనుపించుఁగాని—గా
ధారచనంబు గాంచినను దక్కిన ధర్మవిధాన నిర్ణయ
శ్రీరుచిరత్వ మెంచినను జేరును స్కాందపురాణమందు ని
చ్చారిత యంచుఁ దోఁచునొకో? చల్పిన మార్పులవేవి యుండునో

అల శ్రీనాథుఁడు•నైషధాంధ్రమును వ్రాయంబూని యౌచిత్యమం
దెలమింజెంది తదన్యమున్ విడుచుటన్ హృత్పద్మ మందెంచి నా
కొలయం దోఁచిన రీతి నౌచితిని నాయుల్లంబున న్నిర్ణయం
బు లలిన్ శ్రీకరి కన్యకాంబ చరితంబుం జేతు కావ్యంబుగన్

కొంచెమొ గొప్పయోచదివికొంటిని సంస్కృతమాంధ్రభాష యం
దించుక యందు నందుఁ దనియించు కవిత్వము చేయు టందు రా
ణించి శతావధానకృతినీతి సభాంతరకీర్తిఁ గంటి-ని
ట్లంచితమైన సౌరుఁ గననయ్యె ధనం బొకఁడే కొఱంతగన్

ధనమే సాధన మెల్ల కార్యముల కద్దానన్ ఘనత్వంబు లే
ని నరుం డెందులకుం దగం డనుట యెందే నెంతయేఁగానుపిం
చి ననున్ బ్రాంచిత సత్కవిత్వరచనం జిత్తంబు పొల్పొందు వా
నిని సామాన్యముగాఁ గృపం గనదు శ్రీనీరేజపత్త్రాక్షియున్

ఐనను గైసరుల్ తమకు నచ్చిన సత్కవితాలతాంగిపై
నూనిన పేర్మి సంస్కృతిని నొప్పిన చిక్కుల నెల్ల నోర్చి వి
జ్ఞానలసత్కృతిప్రతతి సల్ప ననల్పతర శ్రమంబునుం
బూనెడి వారు వారలకు ముఖ్య మదో? సిరియో? తలంపగన్ ౨౨

కరముం జిన్నతనంబునుండి కవితా కంజాత పత్త్రాక్షిపై
నొరిమం జెంది తదీయలాలనలచే నుల్లంబు రంజిల్లి త
త్సరసత్వంబునఁజొక్కి యెన్నొకృతులన్ శక్త్యంచితస్ఫూర్తిమై
విరచింపం దగు నేఁబదేఁడులకు దాపే యయ్యె నాప్రాయమున్

ప్రాయము పైకొనంగ నిరపాయము గాని తనుప్రకారమా
ప్యాయము గాక యున్నను నభంగురభంగి సుమంగళప్రద
ధ్యేయపదారవింద మయి దీప్తి చెలంగెడి కన్యకాంబ దౌ
శ్రీయుత సచ్చరిత్రము పొరిం దగు కావ్యము సేయ నెంచియున్

ఎందఱొ వ్రాసినార లిది యిందనుకన్ మఱి నింక నెందఱో
పొందుగ వ్రాయుచుండిరటు బొల్చియు బుత్తెకు నొక్కబుద్ధియం
చుం దలపోసి వైశ్యతను చొప్పడినట్టి ఫలం బటంచు నీ
సుందర గాధ కావ్య మగుచుం దగ వ్రాయ దలంచితిన్ రహిన్

అంకిత మీ ప్రబంధము పరాంబిక యౌ నల కన్యకాంబకున్
బొంకముమై నొనర్చునెడఁ బుణ్య మగున్ గులగౌరవంబు, ని
శ్శంకముగా నెసంగు నిఁక సజ్జను లారసి నాదుపైనఁ గూ
లంకషమైన పేర్మి గనులా గగు నంచుఁ దలంచి యెంతయున్

కడు రహిన్ సృష్ట్యాదిగతములౌ ఋష్యర్ధ
గగన శర వసు దిక్పాలపాండ
వా జేందువర్షంబు (195885047) లయిన గల్యాది ఋ
ష్యాగ మా కాశేంద్రి యాబ్దములుఁ (5047) గ

దిక్పారి వసు చంద్ర (1868) దీప్తిని శాలివా
హనసమల్ తగ విక్రమాబ్దములు గు
ణాకాశ శూన్యనేత్రా ఢ్య (2003) వర్షంబు లౌ
వ్యయవత్సర జ్యేష్ఠ మసిత దశమి

సోమవాసరం బింగిలీషు పదితొమ్మి
ది శతముల నలువదియాఱు తీఱగు సమ
జూ నిరువది నాల్గవ తేది సౌరిదిఁ బూని
యెల్ల శుభములఁ గాంచఁగ నెదఁ దలంచి

[1946 సంవత్సరం—జూన్ 24 వ తేది—సోమవారము]

శ్రీ కన్యా పరమేశ్వరి
కాకీర్ణ సురౌఘ మకుట హారిమణిగణ
ప్రాకటరుచిశోభి పదయు
గీ కంజాతకును జ్యేష్ఠగిరి మందిరకున్

శారదైందవ జ్యోత్స్నహసన సుమంద
హాసరేఖామిళ దనుగ్రహ విలసత్క
టాక్ష భంగీ తరంగ రంగాననకును
కుసుమనామ వైశ్యశ్రేష్ఠు కొమరితకును

అర్యాల పేట యున్న పురులందున నెల్లెడ వైభవప్రభా
ధుర్యతమైఁ జెలంగి కడుఁ దోరముగా శ్రితపాలనక్రియన్
జర్యఁగ బూని నట్టి సరసంబగు పేర్మికి నగ్గమైన స
త్కార్యకుఁ గన్యకాంబకును ఖండిత శత్రుచమూకదంబకున్

ఏమె త్రిమూర్తిబృందమున కింకవిరాట్టున కాదిమాతయై
బూమెల కారణంబయి ప్రభుత్వము నెల్లెడఁ జేయుచుండునో
ఆమెకు సర్వదా మధురతా నఘతా ఘనతాప్రధాన దే
వీమణికిం బరాంబకుఁ బవిత్రకు వాసవకన్యకాంబకున్

వ. అనంతకోటి శిరస్సాష్టాంగ దండప్రణామ పురస్స
రాంకిత కృతిగా. ౩౨

తుంగభద్రాతీర రంగమౌ కర్నూల
వైశ్యరత్నము దోమవంశ్యుఁడయిన
గోవిందసుధి సతి కోటాంబ గర్భంబు
నఁదొలి కొడుక నై జననమునొంది
శ్రీ రామచంద్ర పాదారవిందాభివం
దనలబ్ధ కవితాశతావధాన
కరణచణుఁడ స్కూల గాలెజిఁ బండితు
కరణిని బెక్కేండ్లు గడపి యుంటి

వేంకటస్వామిగుప్త నామాంకితుండ
కృష్ణవేణీ నదీ తీర హృద్యమింద్ర
కీల నగ గృహ కనకదుర్గాలసత్క
టాక్షగ విజయవాటియం దలరువాఁడ

వ. ఒనర్చునట్టి సమస్త కలికల్మషాపనోదన పారీణం బును, వందారు సమస్తార్యవైశ్యబృందార్థ కృత సమస్త సత్పదవీ నిర్మాణంబును నయిన శ్రీమత్కన్యకా పురాణంబునాంధ్రపద్య కావ్యరూప గ్రంథంబునకుఁ గథా క్రమం బెట్టులన్నను. ౩౪

# కథా ప్రారంభము

వ. పుణ్యక్షేత్రమును సమస్తదోషాపనోదనంబును నవవర్గ మార్గదర్శకంబును నయిన మహిమాగణ్యం బయిన నైమిశారణ్యంబునం దొకనాఁడు సకల బ్రహ్మోపాసకులయిన శౌనకాది మహామునులు కొలువుందీర్చియుండిన సమయంబునందు

అందుల కేఁగుదెంచి సముదంచిత సద్గుణపూతుఁడున్ శుభా
స్పంద సమస్తవేదచయ సారపురాణ నిదాన బోధనా
నందసమేతుఁడైన మునినాథుఁడు సూతుఁడు రాఁగ నాతనిం
జందము నంద మొందఁగనుసన్మునిచంద్రులు వారు గాంచియున్

నీ దగు రాక రాక వలె నిక్కము మాకు మనశ్చకోరకా
మోదముఁ జాలఁ గూర్చినది పుణ్యుఁడ నీ వరుదెంచినంత నీ
దౌ దురితాపనోదనసమంచిత వాగ్విభవంబునన్ మహా
హ్లాదముతో వినం దగుఁ గదా! సముదార కథానకంబులన్

వ. అని శౌనకాది మహామును లాడినంత సూతపౌరాణికోత్తముండు వినయ వినమితోత్తమాంగుండై సమస్కరించి యిట్లు వచియించె. ౩౮

మీరు మహానుభావులు నమేయ పురాణనికాయ వేదవి
ద్యా రసికప్రకారులును తాదృశులై తగు మీదు చెంత నే
నే రహి మీ రెఱుంగని వెవేనియు బల్కెదు నైన మీ రిటం
గోరిన దానఁ దోఁచినది కొంచెము పల్కెద నాలకింపుఁడీ

అనవుడు శౌనకుం డనియె నడ్గిన చొప్పున మేల్కథావళిన్
గొనబుఁగఁ జెప్పువాఁడ వని కూర్మిని బల్కితి వంతెచాలు నో
మునివర ! సూత ! మాకు వినఁబూనిక వైశ్యుల దేవి కన్యకాం
బను గుఱియించి పెల్లెసఁగు బల్కుము పేర్మిని వైశ్యసత్కథన్

నావుడు శ్రీకన్యాంబా
పావన సత్కథను సూతవరమునిమణి గం
గావాహినిఁ బోలిన సు
శ్రీవాగ్గతి శౌనకాది ఋషులకుఁ బల్కెన్

శ్రీ కన్యకాపురాణము
వీఁకం దగునవ్యఫణితి - విజ్ఞ మనోజ్ఞ
ప్రాకటతర సౌందర్యర
సాకర మది యద్ది వినిచె నట సూతుఁడిటుల్ ౪౨

## శ్రీ మన్మణి ద్వీపము

శ్రీ వైకుంఠ పురాబ్జ గర్భపద గౌరీనాథ లోకాల కెం
తో విన్నాణపు దవ్వు నందెసఁగి సంతోషం బదోషంబుని

త్యావేలక్రియఁ గొల్పు చందమున కిమ్మైనట్టి యావాసమై
ధీ విన్యాస విలాసమై కడు మణిద్వీపంబు పెంపొందెడిన్

ఆగమబృంద వర్ణన సహస్రము లేనియుఁ జాలిరాక వి
ద్యాగరిమాభిరాము లయినట్టి మునీశ్వరు లేని, శక్తిశో
భా గణనం దలిర్చు సురవారము లేని, నుతింప రాక యా
భోగ విభాయుతం బగుచుఁ బొల్చు నొగిన్ రతనాల దీవియున్

రతనా ల్రాలుఁ బసిండియంటిటులమేఁడల్ డాలుగా నొప్ప న
ద్భుత మా నందముతోడఁ గల్పకచయ ప్రోద్య ల్లతాపుష్పరం
జితమై వైష్ణవ శైవ పాద్మజ వర శ్రేణీ తపస్సత్ఫల
ప్రతతిప్రాప్యతకుం గరం బరుదుగాఁ బర్వున్ మణి ద్వీపమున్

మగఱా గోడలు నింక గారుడమణీమాన్యస్థలుల్ పద్మరా
గగణ స్ఫాటిక పుష్యరాగ విలస ద్వాతాయన వ్రాతము
న్నొగి వైడూర్య సురేంద్రనీలరుచులన్ బొల్పొందు భూభాగమ
చ్చుగమెచ్చుం గరమున్ విరాగులకు నిచ్చుందామణిద్వీపమున్ ౪౫

రతనాల నిగనిగల్ మగరాల ధగధగల్
మృగనాభి ఘుగఘుగల్ తగు నరుఁగులు
ఇంద్రనీలము డాలు నింపుగా దనఁజాలు
సొరు గల్గిన ప్రతీహారచయము
శారదైందవ రోచి రారభటీస్పర్ధి
సుధవళప్రాకార శోభి లీల

పగడంబు జగడంబు జగడంబు గల కంబు
కంఠీవితా నోష్ఠగణము సొంపు

ఆదిశక్తి సహస్రనామాళి పఠన
పాఠన శుకశారీ శ్రుతిపర్వ రవము
కల్పలతికా మతల్లి కానల్పతరని
కుంజపుంజ రంజిత మల్ల గొనబు దీవి

హరి హర కంజ గర్భులుఁ దదంబుజనేత్రిలు నాఁడి పాఁడి భృ
త్యరుచిరభంగి నూనఁ జతురాగమముల్ చతురత్వయుక్తిఁదం
బరమున సన్నుతుల్ జరుపు మవ్వము నివ్వటిలం బరాంబికా
చరణపవిత్రితంబయి పసం దగు నా రతనాల దీవియున్

సార సుధారసాంచిత లసన్మణిదీర్ఘిక లందెసంగు బం
గారు హొరంగు పద్మముల కర్ణికలన్ ముసు రాడు భృంగ భృం
గీరవ మంగళప్రకృతి (తతి) కీర్తన మోంకృతిరూప మొంది దే
వేరిని న ప్పరాంబికను వేవిధులన్ వినుతించి నట్లగున్

బాలరసాల సాల నవపల్లవసల్లలితాశనాన్యపు
ష్టాలపనంబు జిల్కగములాఁడు నకర్తృకవాఙ్నికాయ మిం
కోలిని శారికానికర మూనెడి భాషణ సొంపు వేణుగా
నా లఘు సుందరత్వ మరుదారునటన్ నిరతంబు గ్రిందుగన్ ౪౯

వ. బ్రహ్మదేవుండు బ్రహ్మాక్షరంబులతోడను, వాణి

వీణాగా నానేక కళలతోడను, శ్రీమన్నారాయణుం డనేక లీలా విశేషంబులతోడను, శ్రీమహాలక్ష్మీదేవి శృంగారంబయిన పరిష్కారంబులతోడను, శంకరుండు తత్త్వవాక్య ధనంబులతోడను, గంగా గౌరీ దేవులు మహోపచారంబుల తోడను, సంతోసంబు గల్గింపుచుండ-నాశ్రిత జనవిపత్పరం పరా నిర్వాపణ ధూర్వహోఖర్వ యయిన వందారుబ్రహ్మాదిక సమస్త బృందారక బృందవసిష్ఠాదిక మహామునీశ్వర-యక్ష సిద్ధ గంధర్వ గరుడోరగ నర ఖేచరాదిక భరితంబయిన మహాసభాంతరంబు నందు నొకట ౫౦

# శ్రీ పరాంబ

శ్రీదేవియును శారదాదేవియును వీవ
నలఁ గొని యిరుకెలంకులను విసర
తొలి కైసరుండైన నలువ నాల్గు మొగాల
జయబిరుదంబులఁజదువుచుండ
బోటి వేసమునాఁటి నీటు లన్నియుఁ జూపి
వెన్నుఁ డెల్లరిని నవ్వించుచుండ
ఆకాశకేశుఁ"దేమాజ్ఞ" యంచుం బల్కి
కై మోడ్పుతోడను గాఁచియుండ

నిండు కొలువుండి యెల్ల బ్రహ్మాండములను
నేరుపయినట్టి దృష్టిప్రసారముననె

ప్రోచుచుండు పరాంబిక పొల్పుతోడ
అద్భుతమగు వైభవముతో నలరుచుండె

ఆగమముల్ తదంగములు నాగమశీలములుం దపంబులున్
బా గగు రూపముల్ గొని సభాజన భాజనవర్ణనంబు లు
ద్యోగము లూని సల్పు లసదూర్జితసత్కరుణన్ రహించి పా
పాగ శతారమై తగెఁ బరాంబ మహామణి భర్మపీఠికన్ ౫౩

చారు చిరత్నరత్నవిలసన్నిజ పావనపాదపీఠి బృం
దారకపంక్తి ప్రాలి నమన మ్మొనరింపఁగ వారి మేటి కో
టీరమణిప్రభల్ తగి కడిందిగ రంజిత మాత్మపాద పం
కేరుహయుగ్మముం జలుప నెమ్మినెసంగుఁ బరాంబ యిచ్చటన్

నిజరోమాంకురపాళియం దఖిలమౌ సరేజ జాండాళి మేల్
భజియింపం దగు నవ్విరాట్టువు నిఁకన్ బ్రహ్మాది మూర్తిత్రయం
బు జనిం బొంది ప్రవర్తనం దనరు నేపూతాతిపూత ప్రభా
వ జగానిద్ధపుఁ బేర్మిఁ దజ్జనని యొప్పం బొల్చుఁ దద్ద్వీపమున్

ఆయమ దైన వైభవము నాయమ దౌ కరుణావిశేష మిం
కాయమ దౌ ప్రభావము నజాంబుజనేత్రహరాదులేని 'సే
దో యిసుమంతయేని నన నొప్పిన చేవ గలారు గారు,' నా
తాయికి మించ నౌ మహిమ డాలున నొప్పెడినప్పరాంబయున్

వ. అప్పరాంబయే పరాశక్తియును, యోగమాయయును

నాఁబడు-నామెయే యఖిలంబునకు నధికారిణి. ఆమెను శాసించు నధికారి యెవ్వాఁడును లేఁడు. గాన నామె యనీశ్వరి, నిరీశ్వర, కన్యక నాఁబడు. ఆజగన్మాతయే సాకార నిరాకారత్వములతోను సగుణ యగుచు-నిర్గుణ యగుచుఁ దనరు. ప్రతి రోమకూపంబు నందును బ్రహ్మాండంబు లనేకంబులు దనరు. మహావిరాట్టువు ఈయమయొక్క యంశంబనియును-సృష్టి స్థితి లయంబుల పొంటె బ్రహ్మ విష్ణు మహేశ్వరు లీ దేవేరివల్ల నేర్పడిరనియుఁ దెలియనగు. దయానిధి యగు నిమ్మాత విశ్వానుగ్రహార్థంబుగా నానాసందర్భము లనుకూలించుపొంటె - (1) దుర్గ (2) భద్ర కాళి (3) విజయ (4) వైష్ణవి (5) కుముద (6) చండిక (7) కృష్ణ (8) మాధవి (9) కన్యక (10) మాయ (11) నారాయణి (12) ఈశాన (13) శారద (14) అంబిక* యనెడి పదునాల్గు నామంబులతో విశ్వరక్షక స్వరూపంబులం ధరించి, నానావిధ చిత్ర విచిత్ర మనోహర వర్ణనాతీత లీలా మహత్వముతోఁ దనరు. ఇప్పదునాల్గు రూపంబులతో నిప్ప రాంబ మణిద్వీపంబు నందె వేర్వేఱు నెడల కల్పాగ మందార లతాసుధామయ కేళాకూళి మనోజ్ఞ పారిజాత కుంజపుంజ వరటా రాజ హంస శుక పిక శారికా పరిమండితారామ మధ్యంబున విరాజిల్లు. చారుచిరత్న నానా విధ రత్నమయ భవనంబుల బ్రహ్మేంద్రాది బృందారకబృంద వందితపదారవిందయై, అనంత కోటిదేవ దేవాంగనా, మౌని మౌన్యంగనా, దిక్పాలక, వసు,

*శ్రీమద్భాగవతదశమస్కంధ పూర్వభాగము-యోగమాయాఘట్టము

రుద్రాది సేవ్యమానయై, బహుకోటి సూర్య చంద్ర కాంతి విరాజమానయై భాసిల్లుచుండు. తచ్చతుర్దశ మహారూపంబుల యందు క్రోధగుణ ప్రాధాన్యం బే మాత్రమును లేక - మధు మాంసాది తామసపూజాద్రవ్యగ్రహణ రహితయయి, ప్రశాంత మనోహర గాంభీర్య కారుణ్య మాధుర్యధుర్యయై, శ్రీ కన్యాంబా మహాదేవి ప్రకాశించు. ఇయ్యారూపంబులనఁగా నమ్మహాదేవి పరాంబయే వివిధంబులగు స్వరూపంబులతోఁ గన్పట్టుచుండు. అత్తెఱం గమ్మహాదేవి మహామహత్త్వంబ. మఱియును,

ఒగి న ద్దేవి మహత్త్వలీల యది యేమో? బ్రహ్మవిష్ణ్వీశదే
వగణం బక్కడ కేఁగ - నప్డుడుఁ బుంస్త్వంబంతయున్ వీడి స్త్రీ
లుగ మార్పొందియు నెల్లరా శుభనుగొల్తు ర్దీని మర్మంబు వా
రు గనన్ లే దన నింక నేరి తరమో రూపింపఁ దల్లీలలన్

శ్రీ దేవియు, భూదేవియు
నాఁ దనరెడి సజ్జననికి నానా ౨౨ కృతులుం
బ్రోదిం దగుఁబదునాల్గట
నౌదార్యము గాంచుచుండు-నయ్యాకృతులన్

శ్రీ కన్యాపరమేశ్వరి
లోకన్యాసావన సదలోల మనోజ్ఞ
శ్రీకర కరుణాపూరిత
ప్రాకటముగఁ దనరు నల్ల రతనాల్దీవిన్ ౬౦

నైకవిధ బ్రహ్మఋషిపరివేష్టితుం
డగు వాఙ్మనోహరుం డలరుచుండ
సనక సనందన మునిప బృందారక
బృందవంద్యుఁడు శ్రీహరి తగ నొకట
రుద్ర ప్రమథగణ భద్రవైభవుఁడు భ
వానీశుఁడొకట ఠేవం దలిర్ప
ఉపనిషన్నికరంబు నొగి నిగమాగమం
బులు దాస్యముం జల్పఁ బొనర నొకట
ఆగమ పురాణ శాస్త్రేతిహాసవేత్తృ
నైకవిధ తపస్సిద్ధులు హస్తములను
వేత్ర దండంబులం బూని వెలయుచుండ
ఒక సభా భవనమం దొరిమ మించి

బంగరు టరుంగు మీఁదం దురంగలించు
పలుమెఱుంగుల రంగులం బరఁగు నిగని
గనిగఁ దగు రతనాల సింగంపు గద్దె
మీఁదఁ బరమ సౌందర్యంబు మేల్మి దనర

బహురవిద్యుతులను బరిభవింపందగు
కురువింద మణి కాంతి భరము దనర
కోటిచంద్రుల డాలు గోట మీటం జాలు
మగఱాల ధగధగల్ మవ్వ మెసఁగ

మందారపరిమళామంద మందానిల
బృందంబు లెల్లెడ నందమిడఁగ
సామాగ మామల స్వర మనోహరగాన
మాత్మీయసన్నుతి నాచరింప
సకల సౌఖ్య కారణ కారణకలితంబు
ముక్తిమయ పావనాకారము నయినట్టి
యా సభాంతరంబందు సింహాసనమున
కన్యకాపరమేశ్వరి ఘనత మెఱసె

అజ హరిశంభు లొక్కెడ మహామరు లొక్కెడ దిక్పయాధిప
వ్రజ మొక వంక మేటి మునివర్యులొకంటను జేరియుం దనున్
భజన యొనర్పఁగా సకల పద్మభవాండగణైక మాతతా
విజయమయమ్ముగాఁగ మణిపీఠి నెసంగెను గన్యకాంబయున్

అల పదునాలు గై తగు పరాంబిక రూపము లొప్పు నొక్క యొ
క్కలసిత నైజరూప మొగిఁ గ్రాలెడిచో నొక యొక్క యాశ్రితా
త్మలకును మోదమిచ్చుటకు ముచ్చటఁజెందెడి నప్పరాంబ-యం
దొలసెడి కన్యకాంబ దరి నుండిరి వైశ్యకులశ్రితుల్ కడున్

అట్టి వైశ్య లా నాశ్రితులందు నేఁడు
నూర్ల పదునాల్గు (714) గోత్రాలనుం దనరి, రిఁ
కందును సమాధిముని ముఖ్యులైన నూట
రెండు గోత్రాల వార్ముఖ్యరీతిఁ దగిరి

ఽఽ

## సమాధియను వైశ్యఋషి

అల్ల సమాధి వైశ్యుఁడు మహామునివర్యుఁడు ధర్మకర్మర
తోల్లసితుండు- ముక్తిసతి యుల్లము నచ్చిన వాఁడు, వాడు గా
కెల్లెడ నొప్పు వర్తన మ దెచ్చి పొరిన్ సురథాభిధానభూ
వల్లభమౌళి కోల్పడిన ప్రాజ్యపురాజ్యమువాని గ్రమ్మరం
జెల్లరె! నాఁగఁ జెందునటుఁజేసెను వాసిగఁ గీర్తినిండఁగన్

ఆ సమాధి మహర్షి లోనయిన వారు
వైశ్యరత్నముల్ కన్యకాంబా పదార
విందవందారుబృంద మై వెలసిరి కడు
నల మహాదేవి సత్కృప కగ్గ మగుచు

## శ్రీ కన్యకా పరమేశ్వరి యాజ్ఞ

ఊరుభవు లైన యా భక్తవారము దయ
జూచు టారయ లోకోరు సుఖద మంచు
నల్లతల్లి నిర్ణయ మాత్మయందుఁ బూని
యెంతయో కృపతో వారి నేలుచుండి

ఊరుభవుల్ మహోరుగతి నుల్లసనంబును విశ్వమందుఁ జె
న్నారఁగఁ జేయఁ జాలిన ఘనంబగు యోగ్యత గల్గుటన్-దగన్

* శ్రీ బ్రహ్మవైవర్త మహాపురాణము—ప్రకృతి ఖండము, సప్తమాశ్వాసము—అనగా 61 వ అధ్యాయము.

వారిని భూతలంబునకుఁ బంపిన నైహిక పారమార్థిక
శ్రీ రుచిరత్వముల్ భువికి జేర్తురు చాల నటంచు నెంచియున్

అందులకుఁ దగు పద్ధతి యలరునట్లు
ఏడు వందల పదునాలు గెసఁగు గోత్ర
ము లగు వైశ్యులఁ గన్యాంబ పోల నపుడు
గాంచి యిల్లెనుఁ గరుణారసాంచితముగ

ఇచట వసించు నెల్లరును నేదగు లోకమునందునేని నా
ర్తిచయము గల్గుచో నటఁ బొరిం బ్రభవించి యపాంతరాత్మలై
ప్రచురపు ధర్మదీక్షను నభంగురభంగి చెలంగ బూని ము
క్తి చపలనేత్ర పొం దట నొగిం గల వారి కొసంగఁగా నగున్

కలియం దా కలి కాఁకలి
యలఘు వగుట భువిని మానవాళి నధర్మా
త్ములఁ జేసి నరక మొందన్
జలిపెడి నల రీతి మార్పఁ జను మీ ర్సనియున్ ౨౪

వ. ఆ రీతిని

నెఱిని శ్రీకన్యాంబ "నిజవైభవంబెల్ల
ధరణీతలంబందుఁ దనర వలయు"
నంచు సంకల్పించి యాత్మీయ పార్షద
వైశ్యమునులతోడఁ బరఁగ నుం ద్రి

మూర్త్యాది కాశ్రిత పుంజంబుతో వచ్చి
క్షోణీస్థలిన్ "బెనుగొండ" యనఁగ
బృహదద్రి పేరం బురి న్నెలకొల్పి, శం
ఖు శ్రేష్ఠి యవతారమునగు కుసుమ
శ్రేష్ఠి కొమరిత తానయి క్షితిని బుట్ట
"నగరశివ జనార్దనులు భాస్కరుఁడు" ననఁ ద్రి
మూర్తులును "వింధ్యవాసినీ ఫుల్లవనజ
నయనయును గోన కమలయున్ శారదాంబ
యు" నన వారిం గోరె నుర్విఁ బొడమ

శ్రీ కన్యా పరమేశ్వరీమణియటుల్ జెన్నార దీవ్యన్నిజా
స్తోక శ్రీకర వైభవం బఖిలమున్ క్షోణిం దగం జేర్చె నం
శాకార క్రియమైఁ గలిన్ వృజినమొయ్యం బాఁపిధర్మంబు నే
కాకారంబుగ నిల్పఁగా వలయు నం చారంగ లో నెంచియున్

వ. అప్పు డమ్మహాదేవి తన పార్షద వైశ్య మహర్షి బృందంబుతో నిట్లు వచియించె.

కలియుగమున మీ రెల్లరు
నిలయందుం బొడమి మాన్యు లెంచు సునిష్ఠన్
వెలసిన వర్తనమై స
ర్వ్వలకున్ మేల్బంతు లగుచుఁ బొనరన్ వలయున్ ౭౮

వ. అందులకుఁ దగిన యాజ్ఞాపనము లెల్లఁ గైలా సంబునఁ బార్వతీమనోహరుఁడు మీకొనరించును కావున మీ రెల్లరు నఘనాశంకరుండయిన శంకరుం గొలువఁ జను నని శ్రీ కన్యకా పరమేశ్వరి పల్కి వెండియు నిట్లు వక్కాణించె

ఏడు వందల పదునాలు గెసఁగు గోత్ర
ములను నూట రెం డగుగోత్రములు కరంబు
నా కృపకుఁ బాత్రమైన విన్నాణము మెయి
లోకమం దెచ్చువారు సుశ్లోకు లగుచు

# వైశ్యుల దుఃఖము

అమ్మెయిఁ గన్యకాంబ పలు కాడిన వీనుల కద్ది వజ్రపా
తమ్ముగ సోఁకి నంత నది దబ్బఱయా ? నిజమా ? యటన్న భా
వమ్మునఁ గొంత సేపు నల వైశ్యు లెదం గని "కల్ల గాదు ని
క్కమ్మె" యటం చెఱింగి కలఁగందగె వార లభంగురంబుగన్.

కొందఱు మూర్ఛ వోయి రిఁకఁ గొందఱు పెట్టిరి వెఱ్ఱికేకలం
గొందఱు 'కుయ్యో! మొఱ్ఱో!' యనిగోలగనేడ్వఁగనయ్యెగొందఱుం
జిందులఁద్రొక్కసాఁగి రనుకొంటకుఁగూడ భయంబునొందియుం
గొందఱు మాట దక్కి యట నుం దనరారిరి గోడ బొమ్మలై రా—

ఇమ్మెయిఁ జాల సేపు తమ రెవ్వరొ ? ఆ సభయేదొ ? యన్న భే
దమ్ము నెఱుంగ లేక యటఁ దగ్గ కిరాటనికాయ మెల్ల దై

ర్యమ్ములు సన్నగిల్లి మఱి యా పయి మెల్లగఁ దెల్పెనంది దం
డమ్ములు కన్యకాంబకు దనర్చియుఁ బల్కిరి నీతిభీతులన్

## వైశ్యుల విజ్ఞప్తి

అంబా ! మా మన వాలకింప వలె నీ వైనట్టి మేల్సన్నిధా
నంబు న్నిత్య నితాంత శాంతియుత హృన్నాళీకము ల్మాని యం
దంబుం జెందుచుఁ గొల్చుచుందు మొక బాధం జెంద కీనాఁడు నీ
కుం బల్కం దగు నొక్కొ మా పయిఁగడుం గోపాన నిమ్మాక్షి గన్

సకలాంభోజ భవాండభాండపరిరక్షాదక్ష వైనట్టి నీ
వొకసంకల్పము సల్పుదేని జననీ ! యుద్భూతినిం జెంద దొ
క్కొ కడుందుర్లభమైన యేదయిన న ట్లాపొందియున్ మాకు నీ
వకటా ! నీ దరి వాయ నెందులకు నిట్లాజ్ఞాపనం జేయఁగన్

సకలంబైన చ రాచ రాచరణ పుం జారిత్రకందంబ వై
న కడుం జిత్రవిచిత్రలీల వగు కన్యాదేవిరో ! నీవు లో
నొక యింతెంచినఁ గాని దేః దటులుగా నుండన్ మమున్ భూమి కేఁ
గి కలిన్ వందుర నేటి కాజ్ఞ యిదెదో? కిల్కొల్పు మాపైఁగృపన్

మందారప్రసవప్రతాన విగళ న్మారంద మాధుర్యసా
నందాళిన్ మదనంబుఁ జేరఁ జను మన్న ట్లుండుఁ గాదొక్కొ మ
మ్మిందున్ వీడి భువిం జనించుటకుఁ బోండీ ! పార్వతీశాలయం
బందుం జంద్రకళావతంసు మతిమై హర్షొంద నం చీవనన్ ౮౭

వారక శారదేందు పదవార సుహృష్టచకోరకంబు నీ
హార యుతప్రదేశములకై చనఁ జేయుట గాదె? తల్లి! వం
దారుమనోహరంబయిన తావక సన్నిధి వీడి యొండెడం
జేరఁగ మాకు ని మ్మొదలఁ జేయుట చూడ సమస్త నేత్రిరో!

వెలఁయగఁ గొంత కాల మిట వీఁడి యుమారమణాంతి కంబునం
దొలయఁగఁ బొందటన్న యెడ నొక్కవితం బగు నట్లుఁ గాకభూ
వలయముఁ జేరఁ బొందనిన భావము డీల్పడ సాగె మమ్ము ని
స్తులకరుణావిశేషమునఁ జూడఁగదే? జగదేకమాతరో!

హరికడనేని శంకరుని యందను నేనియు నుండి రం డటం
చొరిమను బల్కుదేని శుభరో! యదియుం దగ నొక్కయందమం
చరిగియుఁ గొంత కాల మట నాజగదీశుల పేర్మి నందియుం
బొరి నిట రాఁగ మాకు నొక మోదమకా? యటు గాక నీ విటన్

అవనికి నేము పోవలయునంచు నటం జను ముందు శంభు చెం
త వెసను గొన్ని నాళ్లు మని ధారుణిఁ జేరుఁ డటంచు బల్కినా
వవును కరంబు దుర్భరముగా! భవదంఘ్రి వియోగ మంబ! యి
ట్లవునెడ మామనంబు సముదారతరవ్యథ నొందు మిక్కిలిన్

వ. అని యా జగదంబ భక్తరత్నంబులైన వైశ్యులు కరంబు దుఃఖంబు నొందిరి. అందు నూటరెండు గోత్రాలవా రాదేవేరి సన్నిధానంబును విడనాడుటకుఁ గడుంగడు వందిరి కుందుచుండఁగా న ప్పరమేశ్వరియుఁ గొండొక నిజభావంబున భావించి యిట్లు వక్కాణించె. గా౨

# శ్రీదేవి తెల్పిన వివరణము

ఇది సంకల్పము మార్ప రానిది కరంబీ రెల్ల నియ్యాన చౌ
ష్పొదవన్ ధారుణి కేఁగఁ జెల్లు నట మంత్రోద్యన్మతిం బొల్చు వా
ర్మద మొప్ప న్నను వేగఁ జేరునటు సంపూర్ణాద్భుతిం జేసెదర్
సదనూనాద్భుత శంభుసన్నిధిఁ జనన్ సన్నాహముం జల్పుఁడీ

నిసుఁగు ! లిదాలకింపుఁడీ ! అనిందితమైన జగత్ప్రమోదముం
బొసఁగ నపాంతరాత్మ లయిపోవుచు నుంటిరి. దీని మార్చుచా
ప్పెసఁగదు నాఁగ వైశ్యమణు లెంతయు నద్ది మహాప్రసాద మం
చన దది కానిభక్తి నని యంబ పదంబుల కోలి మ్రొక్కినన్

వ. మరియు శ్రీ కన్యాంబ వారి కిట్లనియె.

కైలాసంబు కపర్ది వాస మటకుం గానంగ నైనంత ద
వ్వైలా గొప్ప 'మహాగిరీంద్ర' మను నీహారాద్రి శృంగం బొకం
డే లీలం గర మంద చందముల నెన్నే శైలముల్ దానికిం
బోలం జాలవు సన్మహత్త్వమునకున్ బొల్పైన తా వద్దియున్

వాసిగఁ జంద్రచూడ శుభపాదజలేరుహ సేవపొంచెఁ గైఁ
లాసము మీరు వెళ్లినఁ జెలంగెడు పూజన వేళలందు గౌ
రీ సముపేతుఁ డాతనిఁ బొరిన్ యజియించుట లైన వెన్క మీ
రాసముదార పర్వతమునందున నుండుఁడి సౌఖ్యమొప్పగన్ ౫౭

ఆ కైలాసము నమ్మహాగిరియు వేఱంచున్ మనంబందు నెం
దే కానీ తలపోయకుం డచట నెంతే మీదు పై నిచ్చ లే
నేకాకార కృపావిశేషమున వర్తింతున్ మదీయార్చ మీ
రా కొండం బొనరింపుఁ డిందువలె మీకందంబుఁ జందం బగున్

మానుఁడు మాఁట లింక ననుమానము మానిన మానసంబులన్
బూని శశాంకశేఖరుని పొంతకుఁ బొం డిపు డీరువైశ్యులా
రా! నెఱి నప్పు డప్పు డెటు లాచరణం బొనరింప నౌను మీ
రా నిరతిన్ వచించు నిటలాక్షుఁడె మీ కటఁ దెల్లమౌ నటుల్

మీ కనుమాన మెందయిన మేకొనునేనియు నేను మీ దరిన్
వీకను గాన వచ్చియును బేర్మిని మీ మది సందియంబు న
స్తోకజవానఁ దీర్తు ననుచున్ వచియించెను గన్యకాంబ-మో
దాకలనంబొ యిం కొకటొ యందిరి వైశ్యచయంబు లందునన్

# వైశ్యులు కైలాసము చేరుట

తప్పని దంబి కాజ్ఞ, సముదారుఁడు సారుఁడు భోగిహారుఁడౌ
న ప్పరమేశుఁ గొల్చుటకు నందఱు దచ్చివలోక మేఁగ నౌ
నప్ప! యటంచు వైశ్యులు సమర్థపు సన్నహనంబుతోడ దా
మ ప్పరమంపు రత్నమయ మై తగు దివిని వీఁడ నెంచియున్

వ. ఏఁడువందల పదునాలు గనఁగా-నూట రెండును, నాఱు
వందల పదిరెండును-గోత్రంబుల వైశ్య లప్పుడు శ్రీ కన్యకా

పరమేశ్వరిని నామె నెలవయిన యమ్మణిద్వీపంబును విడువ మనస్సు రాక యప్పరమేశ్వరి నిట్లు నుతించిరి.

కారుణికావతంసముల కాండములందు నఖండ సద్యశ
స్స్ఫార విహారముం జలుపుచాతురిమైఁ దగునట్టి మాదు దే
వేరిని గన్యకాంబను బవిత్రను జిత్రవిచిత్రలీల కా
ధారపు దేవరం గొలువఁ దగ్గది శ్రీకరియౌ పరాంబికన్

ఆనందంబున కాలవాలమవు గాదా ! సర్వమౌనీంద్ర దే
వానీకస్తవనీయ పావనచరిత్రానూనవై విశ్వవి
శ్వానంత ప్రమదప్రద ప్రకృతి వై హర్వొందు సర్వేశ్వరీ !
నీ నామంబునుతింప నిన్నుఁ గొలువన్ జెన్నొందు మేలెంతయున్

నిన్నుం గొల్చుటకన్న మిన్నగ నెటం డెందాన కానందముం
గ్రన్నం జెందఁ దరంబు గాదు గదః కన్యాంబామహాదేవి! మ
మ్మిన్నాఁడిట్లు నినున్ విడన్ ముదల గావింపంగ న్యాయ్యంబె! ఆ
పన్నార్తిప్రశమౌషధాయిత జగద్వంద్య ప్రభావాఢ్యరో !

కైలాసావాసుం డగు
వ్యాళగ్రైవేయుఁ గొలువ నరుగు మముం బ్రే
మాలోకనలం బ్రోవుము
శ్రీ లీలా ! కన్యకాంబ ! శిష్టాలంబా !

వ. అని లోనుగ శ్రీకన్యకాంబా నుతినతులను గావించి య వ్వైశ్య లంత బయల్దేఱి ౧౦౭

"వందే శంభు ముమాపతి" మ్మనుచునుం బైల్దేటి వైశ్యాళి యు
ల్లం దైవాఱఁగ ముంగలం గనిరి కైలాసంబు గౌరీయు తా
ర్ధేందూద్యన్మకు టైకవాసము సమద్బృందారకౌ ఘాసురే
డ్బృం దానందకర ప్రకార నిగమావేల ప్రభాభాసమున్

భృంగి భృంగరిటాది విమలప్రమథగణ
ములు "మహాదేవ" యం చెలమిఁ గొలువ
పరగ నందీశాది పారిపార్శ్వకు లెల్ల
విమలసద్భక్తిమై వేచియుండ
ఓంకారరూపుండు నోంకారవేత్తయు
నగు గజషణ్ముఖు లలరుచుండ
క్ష్మాధరేంద్రకుమారి సకలజగన్మాత
హైమవతియుఁ జెంత నలరియుండ
జాహ్నవీ చంద్రరేఖాలసన్మకుటుని
అక్షికౌక్షేయు ఫణిహారు హరుని వారు
వైశ్య లటఁ గాంచి సాష్టాంగవందనములు
భక్తి మించంగఁ జల్పి యభంగురముగ

వందనముం బొనర్చెద మభంగురభక్తి చెలంగుచుండ సం
క్రందనముఖ్య దైవత శిరస్థ్స కిరీటసముల్లసన్మణీ
బృందపరిష్క్రియాంచిత పవిత్ర చరిత్రపదారవింద ని
ష్యంది మరందనందిత నతాశ్రితపాళికి నిందు మౌళికిన్ ౧౧౦

వ. అని పలికి యా వైశ్యనికాయం బంతయును, బురాంతకునకు సాఁగిలపడి నమస్కరించి, తాము మణిద్వీపమున శ్రీ కన్యకాపరమేశ్వరి సన్నిధినుండి యామె మొదల ప్రకారముగా నట కరుగుదెంచిన తెఱంగు నెఱింగింపఁగా, భుజంగాభరణుం డాదరణాయత్తచిత్తుండై మే లని పల్కి, తన కైలాసంబున కల్లంతదవ్వున నుండు మహాగిరియందు వారు నెలకొనియుండి ప్రతినిత్యంబును సకాలంబునకుఁ దన సన్నిధానంబునకు వచ్చి, తన యానతి ప్రకారము మెలంగవలయు ననవుడు వైశ్యులెల్లరు మహాప్రసాదం బని యట్లు కావింపఁబూని. ౧౧౧

పౌనఃపున్యముగాఁ ద్రిశూలికి నమోవాకంబులం బల్కి వై
శ్యానీకం బట నేఁడు నూర్ల పదునాల్గౌ గోత్రముల్ జ్యేష్ఠ శై
లానం గాఁపుర మూన బోయిఁ యల గొండం గల్గు సౌందర్య మెం
తేనిం గాంచియు సంతసించియుఁ గడున్ హృద్వీధులన్ వారలున్

సంతత హిమపరిచ్ఛన్న మౌ పట్టులఁ
బండు వెన్నెలఁ బోలి పర్వతాల
నానావిధ ప్రసూనానీక రంజన
నవరత్నచయ మండనమయి తోప
దట్టంబుగా నొప్పు తరు లతాపుంజముల్
గారుడ హరినీలకాంతులూన
కలకంఠ శుక నీలకంఠ హంస ధ్వనుల్
సంగీత సారస్య సరణిఁదెల్ప

శరభ శార్దూల హరి కరి కిరి మృగముఖ
జంతుసంతాన మెంతయు వింత నొసఁగ
ఈ మహాగిరి తగు పేరు నెనయుఁ దగిన
వాస మిదె మన కిందు నంబా మతల్లి

అంతె కాక యీపొంతనే యభవు హితుఁడు
విశ్వధన సహితుఁడు నయి వెలయు ధనదుఁ
డున్నవాఁడు నిజము మన కన్న గారు
ఈ నెలవు శివసేవ కౌ నెల్ల గతుల

సిరి గల వాఁడు కుబేరుఁడు
సిరు లిడు వాఁ డీశ్వరుండు శ్రీగళభక్తిన్
దలుచగును కుబేరుఁడు మన
మొరిమన్ శివభక్తి వృద్ధి నొందెద మిందున్

కరుణాంబురాశి కన్యాం
బ రహిన్ మహాగిరిని మన నివాసము గాఁగం
బరఁగించి యనుగ్రహముం
బరపెన్ మన యందు–నిజము–పైని కతములన్ ౧౧౬

కులమున మనము వైశ్యులము గావున ధేను
గణమును బెంచియుఁ గావ వలయు
వాని వలని గవ్య వస్తువులం జేసి
హోమాది కృత్యము లొనరుప నగు

బేరసారాలం గుబేరుఁ గేరం జాలు
నెచ్చొ తెలివిఁ బ్రకటింప వలయు
నవనిధులను మించు నవనిధుల్ మా వన
ధనసంచయంబును బొనరుప నగు

అన్న వస్త్ర విద్యోపనయనవివాహ
వైద్యముఖ్య సాహాయ్యముల్ పఱపి విరివి
గాఁగ జగతి నార్తుల నెల్లఁ గావ వలయు
నంచు వైశ్యుల్నియమ మూని రందు నిల్చి

వెలయఁ దన పలుకునన్ వై
శ్యు లల మహాగిరిని జేరి శోభితధర్మా
త్ములుగ మనుటఁ గన్యాంబిక
లలి నెఱిఁగియు వారి విడుచు లా గొప్ప కెదన్ ౧౧౭

## శ్రీ కన్యకాపరమేశ్వరి మహాగిరి కేతెంచుట

"మాతల్లిన్ వీఁడి యిందున్ మనుటయెటులనో? మాకుగానంగనౌనే
చేతోమోదంబు నిందున్ జెలగ" నని శ్రితశ్రేణివైశ్యుల్ కలంగన్
మాతృశ్రీ కన్యాంబామణి యల శ్రితులన్ మానఁగా లేక యెంతో
ప్రీతిన్ డెందంబునందున్ వెలసివెడలె నర్థిన్ మహాశైలమంతన్

శ్రీ కన్యాపరమేశ్వరీమణి కహా! జ్యేష్ఠాద్రి మోదం బిడెన్
వీఁక న్నందనకాన నాపహసనావేలాతి గానందకం

దాకారాటవికాతతిన్ సురపశూద్యత్పుంక్తి - మారాంబకా
నీకా భాంబుజనేత్రులన్ బరమమౌనిశ్రేష్ఠ సంఘంబులన్

అందలి కందరంబులు మహామునిబృందము లుండు నిక్క లై
యందలి చెట్లు కల్పకములై మఱిఁ గల్పలతాళి యై లతల్
చందనగంధిలంబు గను సౌరయి యందలి గాడ్పు లెంతొ యా
నందముఁ గొల్పఁగాఁ నచటు నల్వగు కందువ కన్యకాంబకున్

ఆ యూరూద్భవు లేడునూర్లు పదునాల్గౌ గోత్రములా ర్యమని
ప్రాయుల్ నిత్యముఁ గన్యకాంబకు సమర్చల్ సల్పియున్ శూలిదౌ
తాయిం జేరి యటన్ భజించి రల చూడాశ్రీ పరిష్కారక
న్యాయార్ధేందు నహీంద్రకుండలుని భస్మాంగున్ శుభాఽఽంగునిన్

కుతుకము తోడ నిత్య మహికుండలమండితగండమండలుం
డతికిన పేర్మి శూలి సముదారులు వైశ్యుల నెల్లవేళలన్
వితతముదంబునం గను చవేలకృపాపరతంత్రమానస
స్థితి దనరంగ వారిఁ గడు ధీరులుగాఁ గనె నైజసన్నిధిన్ ౧౨౩

గణనాథుం బలె షణ్ముఖుం బలెను శ్రీగౌరింబలెన్ నందిన
ట్లణుమాత్రంబును లోటు లేనిగతి నత్యంతంబుగా వైశ్యులన్
గుణరాశ్యాత్మకు లంచు శంభుఁ డెదలోఁ గొంకింతయున్ లేని కా
రుణికత్వంబున నోమె ముక్కపయి ప్రేల్ పొల్పొంద నెల్లర్గనన్

ఒకనాడు గణపతి యొడికంబుతో నాఁడ
బేరు ల్గనియు మెచ్చి వినతు లిడిరి

ఒకట సుబ్రహ్మణ్యుఁ డోంకార మాహాత్మ్య
మును దెల్ప - నూరుజుల్ గొన బెఱిఁగిరి
హరతాండవముఁ జూచి యానందమున భూత
తతి యాఁడ - నొంట వైశ్యతతి వాగడె
భరతనాట్యముగూర్చి పరఁగ నంద్యాది చ
ర్చల నొకంటను విని రల వణిజులు
వామదేవ పరాశర ప్రముఖ మౌని
వరుల వేదాంత వాదంపు ఫణితులెల్ల
నొక్కట విని యానందింతు రూరుభవులు
అల్ల కైలాసమున భవాన్యధిపు సభను ౧౨[illegible]

వేద వేదాంగ వేదోదంత వేదాంత
వాదోపవాదాళి ఫక్కిఁ గనుచు
బహు పురాణ వితాన పటువిధానవిధాన
పరతంత్రరీతుల పటిమ గనుచు
నట నాభినయతంత్ర నానావిశేషంబు
లన శేషవైఖరిన్ లలి నరయుచు
ప్రణవప్రధాన మంత్రప్రతానంబుల
మవ్వంబులందలి మహిమఁ గనుచు
యోగులన్ యోగిభోగులం దొనరు భోగి
త్యాగులన్ ద్యాగియౌ విచిత్రప్రభుఁ డగు

శంకరుఁ డఘనాశంకరు సన్నిధి మని
సరగ నల వైశ్య లానందసాంద్రు లయిరి

వసువుల్ రుద్రులు దిక్పతుల్ మునులు దేవశ్రేణి యక్షాళి రా
క్షసులున్ బన్నగులున్ నభశ్చరతతుల్ గంధర్వులున్ లోనుగా
వెస నేతెంచియు నుత్తమాంగములు పత్పీఠంబు దాఁకన్ గళ
త్రసమంచత్తనుఁ డల్ల శంభునకు జోతల్సల్పి రా వైశ్యులున్

పాదవిభూషణ పద్ధతిన్ ఫణియును
రత్నమంజీరంబు రాణఁ దనర
నెమ్మేనఁ దాల్చు వస్త్రమ్ముగాఁ బులి తోలు
బంగారు రంగు వల్వయుఁ దలిర్ప
అంగరాగంబుగా నలరుచుఁ బూఁది పూఁ
తయుఁ జందనంబు నందంబుఁ గొల్ప
కంఠంబునం దహిగ్రైవేయకము మణి
మౌక్తిక హారముల్ మవ్వము నిడ

ఫాలపట్టికన్ వహ్ని దీవ్యన్నయనముఁ
గస్తురీతిలకంబును గ్రాలుచుండ
శంభుఁడుఁ దదంగనయుఁ జేరి సౌరునిచ్చు
విభవముం గాంచి వైశ్యులు వేడ్కఁ గనిరి ౧౨౮

గరుడవాహన మెక్కి కంజవాసినితోడ
వైకుంఠనాథుండు వచ్చినపుడు

వరటారమణుపయి వాక్సతీయుక్తుఁడై
బ్రహ్మదేవుం డొగి వచ్చినపుడు
చౌదంత హత్తిపై శచివెంబడింపఁగా
బలదైత్య భేదియు వచ్చినపుడు

సార్వభౌమంబు పై శ్రవణుఁ డెక్కియుఁ బ్రియా
స్పద చిత్రరేఖతో వచ్చినపుడు
వైశ్య లెల్ల గౌరీశుని పావనాజ్ఞ
మేర కవ్వారి కెంతేని గౌరవంబు
పరమభక్తిని గావించి వారిదగు న
నుగ్రహంబును జెంది రనూనలీల

వ. అమ్మెయి హరి హర హిరణ్యగర్భు లిందిరా పార్వతీ వాక్సతీ యుక్తులై యెక్కిరింత లయిన గరు డాధికార నంది హంసంబులతోడ దరిసెనం బిడినప్పుడు నూర్మడుంగుల సంతసం బుల్లంబులందు మల్లడిగొన వారిని సింకను నట సవాహనంబుగా సతీయుక్తంబుగాఁ జేరిన దేవేంద్ర కుబేరాదులను గాంచి సవి నయ భయానత తనుయుతులై ౧౩౦

మరుని గాంచిన వాఁడు మరుని గాల్చిన వాఁడు
మరుని తో డగువాఁడు మా గురువులు
మా నాయకుండు సుమానాయకుండును
మాఁటనాయకుఁడును మా గురువులు

అక్కనన్ మేన నాస్యమున సతులఁ దాల్చి
మవ్వంబు వారలు మా గురువులు
మా యాతిగులును నామ్నా యాతిగులు నిఁక
మాయాకలితులును మా గురువులు

గరుడిపై నెద్దుపైనఁ జక్రాంగము పయి
నెక్కి తిరిగెడు సాముల కిఁక జగములఁ
బ్రోవఁ గూల్పఁ గొల్వఁ దగు విభులు తలంప
మా గురువులు; వారల కివే మా వినతులు

వ. అని వైశ్యులు త్రిమూర్తులకును, దద్భార్యలకును నమస్కరించి తక్కంగల దేవేంద్రాదు లగు వేల్పులకును, వేల్పు సానులకును నమస్కారంబు గావించి యుండునెడ భవానీపతి వైశ్యులం గాంచి యిట్లనియెడి. 132

మనమం దెంతయుఁ బేర్మి మీ కనియెఁగా! మణ్యంత రీపంబునం
దునఁగన్యాపరమేశ్వరీమణి కడుం దోరంబుగా "ధర్మర
క్షణమున్ మీరు కలిం ధరాతలమునం గావింపఁగా నుర్వికిం
జనఁగా నో" నని యల్ల కృత్యమునకున్ వైశంబ పొం దిప్పుడున్

కలియుగ మేఁగుదెంచియు నఖండధరాతలమున్ గరం బవ
స్థలఁ గనఁ జేయుచుండెను గదా! గద మట్టుల నల్లబాధయం
దొలసిన వారి నేఁచెడి సమూర్జితబుద్ధులు మీర లేఁగి ని
స్తుల మగు ధర్మమున్ భువిని జొప్పడఁజేసియు మేలుఁగూర్పుఁడీ.

స్తవనీయంబుగ ధర్మమర్మములు విస్తారంబుగాఁ బూని, భూ
భువనంబందును మేలుబంతు లయి పొల్పుం గొల్పుఁ డెంతేని వై
శ్యవరుల్ తాఁ గలి యాఁకలిం గలిగి విశ్వంబెల్ల గాసిల్లఁ జే
యు వెసన్ మీర్పనితత్ప్రయత్నమున కెంతో యంతుఁగూర్పందగున్

అని శివుఁ డాఁడ వైశ్యతతు లా నుడులన్ విని నెమ్మనంబునం
దునఁ గడుఁ జింత నొందియును దో ర్తను వందన మాచరించి యి
ట్లని "రభవా! దయారసము నాంతరమందునఁ బూని మా నుడుల్
విన వలె మాదు కోర్కె జరిపింపవలెం గర మేము మేల్గనన్

రతనాల దీవిఁ గన్యాం
బ తగన్ బృహదద్రిఁ జేరి మని శివ సమ్మా
నితసన్నిధి మనుఁ డనె ని
వ్వితమున శివ! నీవ మము భువికిఁ బంపెదవే?

ఆకాశమునుండి భువికి
నాకడనుండి యతలమున కన్నట్లుగ మా
దౌకరణియు నిట నగుఁ గద?
శ్రీకన్య దరిసి విడి యిటఁ జేరి భువిఁ జనన్

"పరమేశ! రమేశముఖుల్
కరుణానిధు లిందుఁ గలరు కర మరసియు ని
త్తెఱగున మా కిం పిడ వలె
వారిమ" నన(గ నాలకించి యోలి శివు డనున్ ౧౩౯

